హనుమంతరావు, మాడపాటి

# వేదకాలపుహిందూర్యులు

బెజవాడ, 1927

Record no. 230

# Hanumantarāvu, Māḍapāṭi

# Vēdakālapuhindvāryulu

Bejavāḍa, 1927

Record no. 230

## Bibliographic Record Target

హనుమంతరావు, మాడపాటి.

వేదకాలపు హింద్వార్యులు / గ్రంథకర్త మాడపాటి హనుమంతరావు.- 1. కూర్పు.- బెజవాడ : వాణీ ముద్రాక్షరశాల, 1927.

(4), 2, 3, 4, 92, 8 p. ;18 cm.

Record no. 230

Hanumantarāvu, Māḍapāṭi.

Vēdakālapu hindvāryulu / granthakarta Māḍapāṭi Hanumantarāvu.- 1. kūrpu.- Bejavāḍa : Vāṇī Mudrākṣaraśāla, 1927.

(4), 2, 3, 4, 92, 8 p. ;18 cm.

Record no. 230

శ్రీప్రచారిణీ గ్రంథమాల:—౨.

సంపాదకుడు:

వ్వాడ వెంకటప్పయ్య.



# కాలపు హింద్వార్యులు.

గ్రంథకర్త:

డపాటి హనుమంతరావు.



మొదటి కూర్పు ౧౦౦౦ ప్రతులు.



బెజవాడ
వాణీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపబడియె.

1927

| చందాదారులకు | | ఇతరులకు |
|---|---|---|
| హాలి ౧-౦-౦ |  | హాలి ౧-౮-౦ |

# విషయానుక్రమణిక.



---




1. మ॥ రా॥ రా॥ శ్రీ సూర్యాపేట వర్తకసంఘము.

2. మ॥ రా॥ రా॥ శ్రీ నాయుని వెంకటరంగారావుగారు,
జమీందారు, మునగాల.

3. మ॥ రా॥ రా॥ శ్రీ వేంకట ముత్యంరావుగారు,
సర్దేశముఖు, సర్కారు ఆరామగిరి,
ఇందనరం, చెన్నూరు తాలూకా,
అద్లాబాదు జిల్లా.



కృషిప్రచారిణీ గ్రంథమాల.

# ప్రధానపోషకులు.

1. మ॥ రా॥ రా॥ శ్రీ
జువ్వాడి ధర్మా[illegible]రావుగారు,
దేశముఖు మఖ్తేదార్,
భీమవరం, జగ్త్యాలతాలూకా.

2. మ॥ రా॥ రా॥ శ్రీ
జువ్వాడి ధర్మా వేంకటజగపతిరావుగారు,
మఖ్తేదార్, చలగల్లు,
జగ్త్యాలతాలూకా.



# రాజపోషకులు.

1 మ. రా. రా. శ్రీ చెన్నమనేని నరసింహారావుగారు,
దేశముఖు మఖ్తేదారు, ఇటికేల,
జగ్త్యాల తాలూకా.

2 ,, చెన్నమనేని వెంకటకూనారావుగారు,
సర్దేశాయి శిరసిల్లా,
కరీంనగరం జిల్లా.

3 ,, చిన్నెని వెంకటేశ్వరరావుగారు,
దేశముఖు, రామాంజిపేట,
జగ్త్యాల తాలూకా.

4 ,, జువ్వాడి రామగోపాలరావుగారు,
మఖ్తేదారు, మదన్నూరు,
జగ్త్యాల తాలూకా.

5 ,, కతార్ రామచంద్రరావుగారు,
కతారి రామవరం,
చేర్యాల తాలూకా.

6 ,, గుండవరపు జగన్నాథరావుగారు,
గట్ల నర్సింగాపురం,
హుజూరాబాదు తాలూకా.

7 ,, చెన్నమనేని వెంకట్రావుగారు,
దేశాయి శిరిశిల్లా.

8 ,, ఎర్రబల్లి వెంకటేశ్వరరావుగారు,
దేశముఖు, కల్లెడ,
వరంగల్ తాలూకా.

# పోషకులు.

1 మ. రా. రా. శ్రీ శ్రీనివాసరావుగారు,
పేష్కారు తహశీల్ హుజూరునగర్.

2 ,, కొలిపాక లక్ష్మిమనోహరరావుగారు,
రెబ్బవరం,
ఖమ్మం తాలూకా.

3 ,, రేపాక వెంకటనరసింహారెడ్డిగారు,
సర్దేశముఖు విస్నూరు,
చెర్యాల తాలూకా.

4 ,, చందూరు వణిక్సంఘము.

5 ,, వెంకటభూమారెడ్డిగారు,
సర్దేశాయి, ఆర్మూరు.

6 ,, చాకుంట కిషనరావుగారు,
దేశపాండ్యా, జగ్త్యాల.

7 ,, పునుగోటి మంగారావుగారు,
కోడిమేల, జగ్త్యాల తాలూకా.

8 ,, చీటి వేంకటనరసింహారావుగారు,
దేశముఖు, జాగీరు మెట్టుపల్లి.

# సహాయకులు.

1 మ. రా. రా. శ్రీ కోదాటి లక్ష్మీనరసింహారావుగారు.
2 ,, మామునూరు రామకిషనరావుగారు.
3 ,, లక్కరాజు హనుమంతరావుగారు.
4 ,, యామా అరవయ్యగారు.
5 ,, గడ్డం నరసింహారెడ్డిగారు.
6 ,, నెల్లుట్ల లక్ష్మీనరసింహారావుగారు.
7 ,, బి. కిషనరావుగారు.
8 ,, వేనేపల్లి రామారావుగారు.
9 ,, మేరెడ్డి జనార్దనరెడ్డిగారు.
10 ,, మందడి రామకృష్ణారెడ్డిగారు.
11 ,, వనం నరసింహారావుగారు.
12 ,, అయితరాజు జీడికంటి రామారావుగారు.
13 ,, యేదునూతల వేదగిరిరావుగారు.
14 ,, పూసుకూరు రామారావుగారు.
15 ,, కాసుగంటి నారాయణరావుగారు.
16 ,, గండ్ర కిషనరావుగారు.
17 ,, ముత్తినేని బుచ్చయ్యగారు
18 ,, అన్నమనేని నరసింగరావుగారు.
19 ,, పోలేపల్లి శ్రీనివాసరావుగారు.
20 ,, హనుమదాంధ్రగ్రంథాలయం.

21 మ. రా. రా. శ్రీ వేణుగోపాలస్వామి గ్రంథాలయం.
22 ,, దహాగం సెంటయ్యగారు.
23 ,, గుండవరపు రంగారావుగారు.
24 ,, జీర్లవెల్లి చెంగల్ రావుగారు.
25 ,, కొత్త మల్లయ్యగారు.
26 ,, సురభి రామారావుగారు.
27 ,, పలివెల శేషగిరిరావుగారు.

---

# పీఠిక.

ఈ పుస్తకములోని (౧౯) వ్యాసములును, క్షాత్ర యుగము (Epic age) నాటి యార్యుల జీవన విధానమును దెలుపుటకై వ్రాయబడినవి. ఇవి కొన్ని సంవత్సరములక్రింద బెజవాడయందు వెలువడుచుండిన "గ్రంథాలయ సర్వస్వము" అను త్రైమాసకపత్రికయందు అప్పుడప్పుడు ప్రకటింపబడుచు వచ్చినవి. ఆవ్యాసములనే ఇప్పుడు మన్మిత్రులగు శ్రీయుత పువ్వాడ వేంకటప్పయ్యగారు (కృష్ణప్రచారిణీ గ్రంథమాల సంపాదకులు) నాయందు వారికిగల యభిమాన విశేషమున గ్రంథ రూపమున వెలువరించుచున్నారు.

దీనిలోని వ్యాసములను రచించుటయందు స్వాతంత్ర కల్పనము (originality) ఏమాత్రమును లేదు. బొంబాయివాస్తవ్యులును. మన్మిత్రులునునగు రావుబహద్దరు చింతామణిరావు వైద్యా, ఎం. ఏ. ఎల్. ఎల్. బి, గారు వ్రాసిన విఖ్యాతమగు "ఎపిక్ ఇండియా" (Epic India) అను ఆంగ్లగ్రంథములోని వ్యాసములకు నారచన కేవలము అనుకరణము. అంతే రావు బహద్దరు వైద్యాగారి గ్రంథమున క్షాత్రియుగము నాటి ఆర్యులనుగూర్చి తెల్పు వ్యాసములింకను ఎన్నియో కలవు. అవియు తెనుగున ప్రకటింపబడినచో, పేదదైయున్న ఆంధ్ర చారిత్రిక వాఙ్మయమునకు కొంత పుష్టికలుగుననుట నిశ్చయము.

"గ్రంథాలయ సర్వస్వ" ప్రకటన మాగిపోవుటతో, నాకు నీ గ్రంథవిషయముల తెనిఁగించు నుత్సాహము ఆగిపోయెను. ఇందునకు నేనెంతయు చింతిల్లుచున్నాను.

రావుబహద్దరు వైద్యాగారు మన దేశచరిత్రములోని హిందూమహాయుగమున నిపుణులు. వారివచనా విధానమును అద్వితీయమని నావిశ్వాసము. చారిత్రక వాఙ్మయము చదువు వారందరికి నెక్కువయుత్సాహము గొలుపునది కాదు. అట్లయ్యు శ్రీ. శే. కొమర్రాజు లక్ష్మణరావు ఎం. ఏ. గారివలెనే శ్రీ వైద్యాగారును చరిత్రను మనోహరముగా నొనర్చుటయందు సమర్థులు. వీరు ఆంగ్లమున రచించిన గ్రంథములలో ముఖ్యములు "మహాభారతసమక్షణము"(Mahabharata a criticism) "రామాయణ సమస్య" (The riddle of Ramayana) "హిందూదేశ క్షాత్రయుగము" (Epic India) "హిందూ మహాయుగముయొక్క మధ్యకాల చరిత్ర" (History of Medeaval Hindu India) అనునవి. ఇవు అన్నియు విజ్ఞానప్రదములును, మనోహరములును, పరిశోధనా పూర్వకములును నగు గ్రంథములు. ఆంధ్రసోదరులు వీనిని పఠించినచో అనేక నవీనవిషయముల నెరుగగలరు. పై వానిలో "మహాభారత" "సమీక్షణము" అనుగ్రంథము నావలన తెనిఁగింపఁబడినది. దీనిలోని కొన్ని యధ్యాయములు "ఆంధ్రభారతి" (మచిలీపట్నము) "ఆంధ్రాభ్యుదయము" (హనుమకొండ) "దేశబంధు" (వడ్డెపల్లి) మాసపత్రికలలో ప్రకటితములైనవి. తక్కిన గ్రంథములను తెనుఁగున వ్రాయఁదలచితినిగాని, అవకాశము లభింపకపోయెను.



ఈ వ్యాసముల వ్రాయ నన్ను బురికొల్పిన నామిత్రులగు శ్రీయుత నరింపల్లి జానకిరామయ్యగారికిని, వీనిని గ్రంథరూపమున ప్రకటించుచున్న కృషిప్రచారిణీ గ్రంథమాలా సంపాదకులును, నిర్దుష్టముగాను చక్కగాను దీని నచ్చొత్తించుచున్న వాణీముద్రాలయము వారికిని కృతజ్ఞుఁడను.

"ఆంధ్రకుటీరము"
రెసిడెన్సిబజారు, హైదరాబాదు,
౧౫—౧—౧౯౩౨.

మాడపాటి హనుమంతరావు.

# సంపాదకీయ భూమిక

కృషిప్రచారిణీగ్రంథమాల చందాదారులకు

విన్నపము.

మాచందాదారులు మాకుపరమహితులు. మేము గ్రంథమాలస్థాపించి మూడువర్షములైనను, యింతవరకొక్క కుసుమము మాత్రము ప్రచురించి మామిత్రులసహవాసము మఱచితిమి. అంతమాశత్రుపక్షము వారు కొందరుమమ్ములను స్థానిక పత్రికలమూలమున హెచ్చరించిరి. కొందరు సమక్షముననే పరిశీలించిరి. వీనికన్నిటికిని ప్రత్యుత్తరములు వివరముగా తెలిపియున్నాము. ఇందుమూలమున మాచందాదారులును, మిత్రవర్గములోని మరికొందరు వెలమమహాశయులును, మాయార్థిక లోపమును గ్రహించి మాకన్నివిధముల సహాయమొనర్చి, తిరిగి కార్యనిర్వహణము క్రియారూపమునదాల్చుటకు తోడ్పడినందులకెంతయు శ్లాఘించుచున్నాము.

క్షాత్రకాలపు హిందార్యులు శ్రీయుత మాడపాటి హనుమంతరావు పంతులుగారు వ్యాసరూపమున గ్రంథాలయ సర్వస్వమునందు చిరకాలము క్రిందటనే వ్రాసిరి. మేము మాగ్రంథమాలకొక గ్రంథము వ్రాయుడని ప్రార్థించినపుడు, శ్రీపంతులుగారు మా వేడుకను నిరాకరింపజాలక, యీగ్రంథము ప్రకటించునెడ జనోపయోగముగానుండునని సలహానిచ్చుచు తమగ్రంథ



మును ప్రేమపూర్వకముగ మాకొసంగినందులకు వినయపూర్వక వందనములర్పిస్తూ యున్నాము.

ఈగ్రంథమునందు భారతగాథయందలి యెన్నియో నిదర్శనములు స్మరణకుదెచ్చి పూర్వపు యితిహాసములను దృక్పథమున తెప్పించినవారైరి. గ్రంథము సరసవంతముగా వ్రాసిరని నే నంతగా వ్రాయుట అనవసరము. ఏలయన శ్రీయుత మాడపాటి హనుమంతరావు పంతులుగారు విఖ్యాతపురుషులు, ఆంధ్రావనికి చిరపరిచయులు; మరియు జగద్విదితులు "జగమెరిగిన బ్రాహ్మణునకు జంధ్యమేలయన్నట్లు" శ్రీపంతులుగారినిగూర్చి వ్రాయుట మమ్మాటికీయనవసరము అయినను యీసందర్భమున మ. రా. రా. శ్రీగారినిగూర్చి రెండుమాటలు చెప్పదలచితిని. పంతులుగారు నిజాము రాష్ట్రాంధ్రోద్యమస్థాపకులు. భాషాసేవకులు. దయార్ద్రహృదయులు. దేశసేవాధురంధరులు. పరోపకారులు. ఇవన్నియు వ్రాయుటకన్న నిజాము రాష్ట్రాంధ్రమండలమునకు మాణిక్యమని యొక్కమాటబలికిన చాలును.

శ్రీయుతులు రాష్ట్రములోని భాషాసంస్థల కొనర్చిన మేలు వ్రాయబూనిన గ్రంథములుచాలవు. పలువిధముల విద్యాభివృద్ధికై పాటుబడుచు తమజీవితమును దేశసేవకే ధారవోయుచున్నారు.

మాగ్రంథమాల కుసుమము ముద్రణకాక పూర్వమే యొకవర్షము పఠనీయగ్రంథముగా నియమించి మాసంస్థకుగౌరవమొసంగిన గృహవిద్యాపరీక్షాసంఘము (Research University)

వారునందనీయులు. కృషిప్రచారిణీ గ్రంథమాలనుండి నిజాము రాష్ట్రాభివృద్ధి ప్రబోధకములగు వివిధగ్రంథరాజములు వ్రాయించి యుడతాభక్తిని ఆంధ్రభారతీచరణ పూజనొనర్చి కృతార్థుడ కాదలంచి, మామిత్రులప్రోత్సాహమున తొలుదొల్త సూర్యాపేటయందు మాసంస్థనెలకొల్పితిమి. అంతమాపాలిటి పెద్దమ్మ మాకడ్డమువచ్చి యెన్ని యాటంకములు కలుగజేయుటయేగాక మాసదుద్దేశ్యములు సంపూర్తి నెరవేర్చినదికాదని వ్రాయుటకు మిక్కిలి చింతిలుచున్నారము. నెలకొల్పగనే మాయుద్యోగ పాఠ్యగ్రంథములు దేవరకొండ, భువనగిరి, మిర్యాలగూడెం నల్లగొండమున్నగు వివిధస్థలములకు యీడ్వబడినవి. మాతోడనే గ్రంథమాలయు డొల్లగింతలుకొట్టినది. గాని యీయాస్థలములలో గ్రంథమాలకు తగినన్ని సౌకర్యములు లభింపక, మామిత్రులపాలిటి ద్రోహులమైతిమని చింతులుచుండ మమ్మునగౌరవముగ నాహ్వానించి, మాకీగ్రంథమునకగు వ్రయములుస్వహస్తపరహస్తములచే సహాయమొనర్చిన చలగల్లు మత్తేదారులగు మ. రా. రా. శ్రీ. ధర్మావెంకటజగపతిరావుగారు కృతజ్ఞతకు పాత్రులు. ఇదేరీతి మరికొందరు కొన్నిగ్రంథములవ్రయము నిచ్చుటకువాగ్దానముచేసిరి. వారందరును మాయెడ మహోపకారులు.

ఇటులనే పండితమహాశయులనేకులు వారువ్రాసిన సద్గ్రంథములిత్తుమని చెప్పిరి. ఏదియెటులున్నను సొమ్ములదుఃఖాధీనండ లేననెత్తిరి. ఇంతలోనీమాగ్రంథమాల ముఖ్యోద్దేశ్యము నెరవేర్పుటెట్లని యోచించుచుండ, విదేశపర్యటనమొనర్చి వ్యవసాయపరిక్షలో కృతార్థులై అనుభవమును సంపాదించి, ప్రజాహిత



కార్యములో నెక్కువగా పాల్గొనుచు ఖ్యాతిచెందిన సంఘసంస్కర్తలగు శ్రీయుత దర్శిచెంచయ్య బి. యస్. సి. గారు వ్రాసిన వ్యవసాయశాస్త్రచరిత్ర నొసంగుట కయ్యకొనినందులకభినందిస్తూయున్నాము.

మేమీవర్షమునింక శశికళయను నవలయు, అనుబంధముగ జర్మనీయుద్ధమును, వ్యవసాయశాస్త్రచరిత్ర (History of the development of Agriculture) యను గ్రంథములు ప్రకటించి ప్రథమసంవత్సరకార్యము ముగింతము. అటు వెనుకపద్మినీబాయి రెండుభాగములును, వ్యవసాయచరిత్ర రెండుభాగములు గలసి నాల్గుగ్రంథములు సక్రమముగా చందాదారులకు చెందచేయగలము.

ప్రథమవర్షగ్రంథములు శివరాత్రికిని, ద్వితీయవర్షపొత్తములు ఉగాదికిని పంపగలము. మాకుస్వంత ముద్రణాలయము లేనికతమున యిట్టివిరామమునకు హేతువైనది. ఇకముందువిరామము లేక సక్రమపద్ధతుల గ్రంథమాల నిర్వహింపగలము. ఈ విషయమున మాకు వర్తకసోదరులునగు శ్రీయుత యీమారామనర్సయ్యగుప్తగారు కుడిభుజమగనిలబడి తోడ్పడినందులకెంతయు ప్రశంసించుచు, మాయెడ విశ్వాసముంచుటకు మాచందాదారుల నింకొకమారు ప్రార్థించుచు, నింతటితో మాస్వవిషయమును విరమించుచున్నాము.

విధేయుడు,

సూర్యాపేట<br>
ది ౨౫-౮-౨౬

మ్యాడ వెంకటప్పయ్య,<br>
సంపాదకుడు.



# * క్షాత్రయుగమునాటి హింద్వార్యులు, వారి యుడుపులు.

క్షాత్రయుగమునాఁటి మనవారి స్థితిగతులను వారి యాచారవ్యవహారములను దెలుపు ముఖ్యగ్రంథములు భారత రామాయణములు. వేల సంవత్సరముల క్రింద నుండిన మన పూర్వీకు లెట్టి యుడుపులను ధరించుచుండిరో తెలిసికొనవలయు ననిన మన మా గ్రంథములతో నెక్కువ పనిఁగొనవలసి యున్నాము. ఈ యంశమును గుఱించిన వివరములు వానిలోనైనను విస్తారముగా గానరావు. అయినను ఉన్నసంగతులనుబట్టి మన మేమి గ్రహించవలయునో చూతము.

---

* క్షాత్రయుగమనఁగా మన దేశచరిత్రములోని యొక సగ్ణితకాలము. ఈకాలమున మనదేశమునందలి వీరకావ్యములగు రామాయణ భారతములు రచింపఁబడినందున దీనికి క్షాత్రయుగమని పేరుపెట్టఁబడినది. పాశ్చాత్య విద్వాంసులను వారి ననుసరించిన మనవిద్వాంసులును ఈయుగముయొక్క పరిమితి వేయిసంవత్సరముల (క్రీ. పూ. ౧౨౦౦ నుండి క్రీ. పూ. ౨౦౦ సంవత్సరములవఱకు) దని సిద్ధాంతీకరించియున్నారు. సి. వి. వైద్య ఎం

పురుషు లా కాలమున ధరించుచుండిన యుడుపులు మిక్కిలి సామాన్యమైనవి. అప్పటివారి యుడుపు లనఁగా, ఎక్కువ పొడవు తక్కువ వెడల్పుగల రెండు విడివ వస్త్రములు మాత్రమే యైయుండవచ్చును. ఒకటి కట్టుకొనఁబడునది. రెండవది కప్పుకొనఁబడునది. మొదటిది నడుమునుండి క్రిందిభాగమును గప్పుచుండెను; రెండవది నడుముమీఁదిభాగము నాచ్ఛాదించుచుండెను. ఈయూహ కేవలము కల్పితమైనదని తలఁపఁగూడదు. ఇది సప్రమాణమనుట నిస్సంశయము. ద్రౌపది కౌరవసభలోనికి లాగికొని రాఁబడినపుడు, దుర్యోధనుఁడు ఆమె చూచుచుండఁగాఁ దన కుడితొడమీఁది వస్త్రమును దొలఁగించెనని మహాభారతమందున్నది. దాదాపుగా నిప్పటికాలమున వాడుకయందున్న విధమున ధోవతిఁగట్టికొనిననే కాని అతఁడట్లు తన కుడితొడను అనాచ్ఛాదితముగాఁ జేయుట సంభవింపదు. రాజు మొదలు జనసామాన్యమువఱకు నందఱును ధోవతినే కట్టుకొనుచుండినట్లుకూడ తోఁచుచున్నది. భేదమేమైన నుండినచో వస్త్రముయొక్క మృదులత్వమునందును నేతయొక్కసన్నదనమునందును ఉండవచ్చును.

ఏ., ఎల్. ఎల్. బి. గారు క్షాత్రయుగము వైశాల్యమును ఇంచుమించుగా క్రీ. పూ. ౩౦౦౦ నుండి క్రీ. పూ. ౨౫౦ వఱకు నిర్ధారణచేసియున్నారు. వీరి యభిప్రాయముతో నందఱేకీభవింపకపోయినను, వీరు చెప్పిన యంశములను వివరములను మనము పాశ్చాత్యవిద్వాంసులచే నిశ్చయింపఁబడిన క్షాత్రయుగమునకే వర్తించునవి యని యూహించుకొనవచ్చును. వైద్యాగారి మతమున భారతయుద్ధము క్రీ. పూ. ౩౧౦౧వ సంవత్సరమున జరిగినది. గ్రంథము తరువాత కొఁదికాలమునకే వ్రాయఁబడెనని వారభిప్రాయపడుచున్నారు.



ధృతరాష్ట్రుఁడు పుత్రుని శరీరము కృశించినందునకుఁ గారణము నడుగు సందర్భమున నిట్లనును "నీవు ప్రావారవస్త్రములను ధరించుచున్నావు. మాంసముతో నన్నమును భుజించుచున్నావు. దివ్యాశ్వముల నెక్కి సవారీచేయుచున్నావు. ఇట్టి నీవు కృశించుటకుఁ గారణమేమి?" 'ప్రావారవస్త్రము' లనఁగా నేమో వ్యాఖ్యాతవివరించలేదు. అయినను పైశబ్దమునకు మనము అందమైన వస్త్రములని యర్థము చెప్పిన చెప్పవచ్చునని తలఁచెదను. శరీరోర్ధ్వభాగము నాచ్ఛాదించుచుండిన రెండవ వస్త్రమును గుఱించి మనకంతగాఁ దెలియదు. మతగ్రంథములలో వచ్చిన 'ఉత్తరీయ' శబ్దమునుబట్టి మన మీ రెండవ వస్త్రముండెనని నిశ్చయించుకొనవలసిన వారమైతిమి. ఈవస్త్రము వెనుకఁ జెప్పిన ప్రకారము శరీరోర్ధ్వభాగమున గప్పికొనఁబడుచుండెడిది. కొన్ని వేళలయందు కుడిచేయి అనాచ్ఛాదితముగా వదలివేయఁబడుచుండెను. అట్టి సమయమున నీయుత్తరీయము కుడిచంక క్రిందనుండి యెడమభుజముమీఁదికిఁ బోవుచుండెనని యూహింపవలయును. విద్యార్థులు 'తమ చేతిని బయటకుఁ దీసియుంచవలయు' నని మనుస్మృతి విధించి యున్నది. ♦ దీనికి వ్యాఖ్యాత 'ఉత్తరీయము కప్పక బయటకుఁ దీసియుంచవలయు' నని యర్థము చెప్పియున్నారు. పురాతనకాలపు హింద్వార్యులు యుద్ధసమయములందు ఉత్తరీయము నిల్లే వైచికొని దాని చెఱఁగులను ఎడమభుజముపైన గట్టిగా ముడివేసికొనుచుండి రని తోఁచుచున్నది.

♦ నిత్యముద్ధృతపాణిస్యాత్ -

వెనుకఁ జెప్పఁబడియున్న రెండు వస్త్రములు తప్ప, అధమపక్షము క్షాత్రయుగారంభమున, హింద్వార్యులు మఱే యుడుపులను ధరించియుండినవారు కారు. లాగులు జాకెట్లు ఎట్టివో వారెఱుఁగరు. కోట్లు చొక్కాలు వారికిఁ దెలియవు. బట్టలను గత్తిరించి తీరుతీరు ఉడుపులుగా గుట్టుట ఆకాలమున లేదు. కుట్టుపని మొట్టమొదట బహుశః * 'సెమిటిక్కు'లలోఁ బుట్టినదై యుండవచ్చును. అది గ్రీకులు పంజాబుదేశమును జయించిన కాలముననో, అంతకుఁ బూర్వము హింద్వార్యులకు పారసీకులతో సంబంధము కలిగినట్టి డెరయసు పరిపాలన కాలముననో మనదేశమునఁ బ్రవేశించి యుండవచ్చును. రామాయణమున ౨ కుట్టుపనివాఁడు వచ్చియున్నాఁడు. కాని మహాభారతమున వానిజాడ ఎచ్చటను కానరాదు. ఇంతమాత్రమున మహాభారతము రచింపఁబడిన కాలమున కుట్టుపనివాఁడు ఉండనేలేదను × అభావవాదమున కవకాశము లేదు. అది యటుండ నిండు. మొత్తముమీఁద క్షాత్రయుగారంభమున హింద్వార్యులలో పురుషులు రెండువస్త్రములలో నొకదానిఁ గట్టికొని రెండవదానిఁ గప్పుకొనుచుండిరని విశ్వసించుటయందభ్యంతరమేమియును లేదు.

---

* ఇది ఏష్యాఖండముయొక్క పశ్చిమభాగముననుండిన యొకజాతి.

౨ తున్నవాయి.

× అభావవాదమనఁగా, ఒకగ్రంథమున ఒకానొకవస్తువు ప్రసక్తి లేదు కనుక ఆగ్రంథము రచింపఁబడిన కాలమున అట్టివస్తువే యుండలేదని వాదించుట.



ఆకాలపు స్త్రీలుసైతము రెండు వస్త్రములనే ధరించుచుండిరని తోఁచుచున్నది. అయినను వీరివస్త్రములు పురుషుల వస్త్రములకంటె నెక్కువ పొడవుగా నుండెడివి. కట్టుకొనఁబడు వస్త్రము శరీరోర్ధ్వభాగమునుగూడ—అనఁగా భుజములవఱకు—గప్పియుంచుచుండెను. చేతులనుమాత్రము దానితో కప్పుకొనక విడిగా నుంచుచుండిరి. గుజరాతు, బంగాళము, మద్రాసు, దక్కనులలోని స్త్రీలు నేఁటికిని అట్లే తమ చీరలఁ గట్టుకొనుచున్నారు. ఉత్తరీయము తలపైనఁ గప్పుకొనుచు సమయము వచ్చినపుడు దానిని ముసుకుగా వేసుకొనుచుండిరి. ఉత్తరహిందూస్థానమం దిప్పటికిని స్త్రీలు ఉత్తరీయమును విధిగా ధరించుచుందురు. దక్షిణహిందూదేశమందు ఇప్పుడు వాడుకలోనున్న చీరలు పొడవుగానుండుటవలన వేఱే యుత్తరీయము అనవసరమయినది. ఉత్తర హిందూస్థానమున ఇప్పటివలెనే పూర్వమునఁ గూడ స్త్రీలు బయటికిఁ బోవునపుడు మాత్రమే యుత్తరీయమును ధరించుచుండిరి.

ద్రౌపదిని అంతఃపురమునుండి బలాత్కారముగా కౌరవసభకు ఈడ్చుకునివచ్చిన సందర్భమును వర్ణించుచు మహాభారతమున వ్రాయఁబడిన సంగతులు పైయభిప్రాయమును బలపఱచుచున్నవి. సభాంగణమున నామె పలుమాఱు 'నేను ఏకవస్త్రను' 'ఏకవస్త్రను' అని జాలిపుట్టునట్లు మొఱపెట్టుకొనెను. దుర్యోధను నాజ్ఞానుసారము ఆయేకవస్త్రమునుగూడ వదల్ప యత్నించిరి. ఈసంగతులను విచారించి చూచితిమేని ఆకాలమున స్త్రీలు కట్టుకొను వస్త్రము సులభముగా నూడివచ్చునట్లు

ధరింపఁబడుచుండెననియు, మొలనూలువంటి దేదియు నుండలేదనియు, ఇప్పుడు ఉత్తరహిందుస్థానమునందు వాడుకలోనున్న లంగావంటిదానిని వారు దొడుగుకొనుచుండలేదనియు తేలుచున్నది లంగావంటి వస్త్రమేమైనయెడల నంత యవలీలగా నూడియుండునా? ఆకాలమున రవికయనఁబడునదికూడ నుండలేదని తోఁచుచున్నది.

ఈ సందర్భమున నొక చిత్రము చూడఁదగియున్నది. పురాతన కాలపు గ్రీకు స్త్రీ పురుషులు ధరించుచుండిన యుడుపులను హోమరు వర్ణించి యున్నాఁడు. అవి మన హింద్వార్యుల వస్త్రములను బోలి యున్నవి. హోమరు కాలపు స్త్రీ ముసుకుగాక ఎక్కువ పొడవు తక్కువ వెడల్పుగలట్టిదియు దేశములోనే తయారయినట్టియు కత్తిరింపుగాని కుట్టుపనిగాని లేనట్టిదియు నగు నొక వస్త్రమును గట్టుకొనుచుండెను; ఆవస్త్రము భుజముపైన నొకసూదితోను నడుముచుట్టు మొలనూలుతోను బిగింపఁబడుచుండెను; చేతులు బయటనే యుండుచు వచ్చెను'' ‖ పురుషులకు మొలనూలుఉండలేదు. పైన నుల్లేఖింపఁడిన ముసుకు హింద్వార్యస్త్రీల యుత్తరీయమువంటిదే యని వేఱుగాఁ జెప్పఁబనిలేదు. "హోమరుకాలపు స్త్రీదుఃఖసమయములందును, స్వతంత్రముగా నేదయిన పని చేయవలసివచ్చినప్పుడును, ముసుకును తీసివేయుచుండెడిది'' సీత తన్ను పరుఁడొకఁడు బలాత్కారముగా చెఱఁగొని పోవునపుడు ఆసమాచారము భర్తకెఱుకపఱచు నుద్దేశముతోఁ దన యుత్తరీయమును వానరసేనాపరివృ

‖ Women of Homer by Walter Capt. Perry.



తుఁడగు సుగ్రీవుఁడుండిన ఋష్యమూకముపైనఁ బడవైచెను. కనుక హింద్వార్యస్త్రీయును హోమరునాఁటి స్త్రీయును ఉత్తరీయము నొక్కొక్కమారు వదలివేయుచుఁగూడ నుండిరి. హిందూస్త్రీవలెనే హోమరుని స్త్రీకిఁగూడ కంచుకముండలేదను సంగతి హోమరు వర్ణనములవలన నేమి పురాతన గ్రీకుల విగ్రహములవలన నేమి మనకుఁ దెలియుచున్నది.

దక్షిణహిందుస్థానమున నిప్పుడు వాడుక యందున్న గోచీపెట్టుకొనుపద్ధతి ఆకాలమున లేదని తోఁచుచున్నది. గోచీపెట్టుకొను నాచారము స్త్రీలలో నాకాలమున నుండినయెడల ద్రౌపది కట్టు పుట్టము దుశ్శాసనుఁ డట్లు ఊడఁగుంజుటకు వీలులేకయుండును. మహాభారతమునం దెచ్చటను నీగోచీమాట రానేలేదు. బాలురకు ఉపనయన సమయమున కౌపీనము పెట్టించు పద్ధతి ననుసరించియే స్త్రీలలో నిట్టి యాచారమారంభమై యుండవచ్చును. పురుషులకు ఉపనయనమెట్టిదో స్త్రీలకు వివాహము ట్టిదగుట చేతనే కాబోలు వివాహితలయిన స్త్రీలవిషయమున మాత్రమే గోచీపద్ధతి విధింపఁబడియున్నది. దక్షిణ హిందుస్థానమందు సయితము కన్యలుగోచీలేకుండనే బట్టగట్టుకొనుచున్నారు క్షాత్రయుగమున నుత్తరీయమును గౌరవనీయురాండ్రు మాత్రమే ధరించుచుండిరి. కావుననే ద్రౌపది సైరంధ్రివేషముతో విరాటునిపురమున నుండినపుడు ఏకవస్త్రగానే సుధేష్ణయొద్దకు వచ్చినది. × బహిష్టలుగా నున్నప్పుడుకూడ స్త్రీలకు ఉత్తరీయముతోఁ బనిలేకయుండెను. ఇంట గృహకృత్యములను నెరవే

× వాసశ్చపరిధాయైకం కృష్ణాసుమలినం మహత్ ‖ విరాట‖ా‖౨

ర్పు వేళసయితము వారు త్తరీయమును వేసికొనకుండిరి. వితంతువు
లాకాలమునఁ దెల్లని యుత్తరీయముల ధరించుచుండిరి. అరణ్య
ముననుండిన ధృతరాష్ట్రుని దర్శించుటకై అతని కుటుంబములో
నివారగు వితంతువులు పాండవుల రాణివాసముతోఁ బోయినప్పు
డు వారు తెల్లని యుత్తరీయములను ధరించి యుండిరని చెప్పఁ
బడియున్నది. × దీనిఁబట్టి యాలోచింపగా, తెల్లని యుత్తరీ
యము వితంతువులకొఱకు మాత్రము విధింపఁబడి యుండెనని
యు తదితర స్త్రీజనము ఎఱుపు నలుపు మొదలగు రంగుల
యుత్తరీయములను వేసికొనుచుండిరనియు తేలుచున్నది. ఇప్పు
టికాలమున వితంతువుల వస్త్రములు ఎఱ్ఱఁగానుండిన మంచిదని
తలఁచుచున్నారు. ఇది ప్రాయశః బౌద్ధభిక్షునుల పద్ధతి ననుసరించి
వచ్చిన యాచారమై యుండవచ్చును. వివాహితలగు స్త్రీలు
కట్టుకొను బట్టలుకూడ వేఱువేఱు రంగులుకలవిగా నుండవచ్చు
ను. కట్టికొనువస్త్రములును ఉత్తరీయములును ఇప్పటికాలము
వానివలెనే అంచులుకలవై యుండెనని తోఁచెడిని.

ఇఁక శిరోవేష్టములను గురించి విచారింతము. ఆకాల
మునను స్త్రీలకు శిరోవేష్టము లుండినట్లు కానరాదు. వారి తల
లకు టోపీకాని మఱేదయిన నాచ్ఛాదనముగాని యుండలేదు.
౨ వితంతువుల తెల్లనివస్త్రములనుగుఱించి వెనుక నుల్లేఖింపబడిన
శ్లోకపు మొదటి చరణము 'ఏతాస్తుసీమంతశిరోరుహాయాః'

× శుక్లోత్తరీయాం నరరాజపత్న్యః॥ ఆశ్రమ॥ ౨౫॥ ౧౬

౨ బయటకు వెడలినప్పుడుమాత్రము వారుతలలపై నుత్తరీయమును
గప్పికొనుచుండిరనుట నిశ్చయము.



అన్నది. ఇది చతుర్ధరుని గ్రంథమునందలి పాఠము. అతఁడు
దీనికి బదులుగా, ఏతాస్త్వసీమంతశిరోరుహాయాః, అని యుండి
ననింతకంటె బాగుండునని వ్రాసియున్నాఁడు. పాపడను చూణా
ముతో నలంకరించుటకై వెంట్రుకలను రెండు పాయలుగాఁ దీసి
తలముడుచుటకు 'సీమంత' మని పేరు. ముత్తయిదువలగు స్త్రీలు
మాత్రమే ఈవిధముగా తలలముడిచికొనుచుండిరికనుక వితంతువు
లనుయిట్టియలంకరణము లేనివారినిగా వర్ణించుటసహజము. ఇంతే
కాదు. "సర్వజనసంహారము జరగి పృథ్వియంతయు శోకమయమై
ఉత్తమ స్త్రీల సీమంతము తీసివేయబడినప్పుడు..." అను నర్థ
ముగల శ్లోకము × కూడ సీమంతము పోవుట వైధవ్యము
యొక్క ముఖ్యలక్షణమని స్పష్టముగాఁ జాటుచున్నది.

మర్యాదగల పురుషులు వెండ్రుకలను ముడివేసికొనుచు
బయటికి వచ్చినపుడు తలగుడ్డ పెట్టుకొనుచు నుండెరి. ఈ తల
గుడ్డపద్ధతి హిందువులు స్వయముగా నేర్పఱచుకొనినదేకాని
ఇతరులను జూచి నేర్చుకొనినదికాదని తోఁచుచున్నది. ఇప్పటి
వలెనే ఆకాలమునందును వారు ధరించు తలగుడ్డ యొక పొడుగు
పాటి వస్త్రము. దీనిని వారు తలచుట్టును వివిధములుగా జుట్టు
కొనుచుండిరి. యుద్ధరంగమునకుఁ బోవుసమయమున భీష్ముఁడు
తెల్ల తలరుమాలును ధరించినట్లు చెప్పఁబడియున్నది. ద్రోణుని
విషయమునఁగూడ నట్టివర్ణనయేకలదు. కనుక వయసుమీరిన
వారి శిరోవేష్టము సాధారణముగా తెల్లరంగుదిగాను యావనుల

× శ్లో॥ సంహారేసర్వతోజాతే పృథివ్యాం శోకసంభవే। బహూనా
ముత్తమస్త్రీణాం సీమంతోద్ధరణేతథా ॥శల్య॥ ౨౧॥ ౨౦

తలగుడ్డ యెఱ్ఱఁగానో లేక ఏదయిన మరియొక రంగుదిగానో యుండవలెను. హిందువుల తలగుడ్డలు గ్రీకులకు విచిత్రముగఁ గాన్పించినట్లు తోఁచుచున్నది. కనుకనే 'ఏరియను' గ్రంథకారుఁడు 'ఇండికా' యను గ్రంథమున నిట్లు వచించియున్నాఁడు. "హిందువులు దూదితోఁ జేయబడిన యొకవస్త్రమును గట్టుకొనెదరు. అది మోకాళ్ళకును చీలమండలకును మధ్యభాగమువఱకుండును. ఇదిగాక వేఱొకవస్త్రమును పయిన వేసికొందురు. దీనిలో కొంతభాగమును వారు భుజములపయినఁ గప్పికొని తక్కిన భాగమును తమ తలఁకు జుట్టుకొనెదరు. ✓ 'ఏరియను' చెప్పినట్లు ఒకటేవస్త్రమును తలకుఁ జుట్టుకొనుటకును శరీరమును గప్పికొనుటకుగూడ వాడుకొనువారు బహుశః బీదవారయి యుండవలెను. గొప్పవారి తలగుడ్డ ప్రత్యేకవస్త్రమై యుండవచ్చును. 'కర్టియసురూఫసు' అను గ్రంథకారుఁడు హిందూదేశమును హిందువులను వర్ణించుచు "వీరు తమశరీరమును పాదములవరకు మృదువైన సన్ననివస్త్రములతో నాచ్ఛాదించుకొనెదరు. పాదుకలు తొడిగెదరు. దూదితోఁ జేయఁబడిన బట్టను తలకుఁ జుట్టుకొందురు." × అని చెప్పియున్నాఁడు. అయినను అప్పటితలగుడ్డ ఇప్పటికాలమున మనదేశమందలి కొన్ని ప్రాంతములలోనున్నంత చిక్కులు కలదిగాను పొడుగుగాను ఉండలేదని తోఁచుచున్నది. దానిని జుట్టుకొనుపద్ధతి బహుశః ఇప్పుడు ఉత్తర హిందూస్థానములోని పేదవాండ్ర పద్ధతివంటిదై యుండవచ్చు

✓ Ancient India. Megasthanes and Arrian by Mac Crindle P. 219.

× Invasion of India by Alexander. Mac Crindle P.188.



ను. ప్రతివాఁడును తన తలగుడ్డను తానే చుట్టుకొనుచుండెను. రాజులు మాత్రము కిరీటముల ధరించుచుండిరి. దుర్యోధనుఁడు భీమునితో జేసిన తుది ద్వంద్వయుద్ధసమయమున కిరీటము అతని తలపైనుండెను. భగ్నోరుఁడై నేలఁబడిన పిమ్మట నాతని తలపయిన నదియట్లేనిలచియుండెను. కావుననే భీముఁడు దాని కాలితోఁ దన్నఁగలిగెను. ఆకాలమున కిరీటము శిరమునకు గట్టిగా బిగింపఁబడుచుండెననియు బంధముల వదలించిననేకాని వీడి రాకుండ నుండెననియు మనమూహింపవచ్చును.

హిందువుల వస్త్రములు తఱచుగా దూదితో నేయబడుచుండెడివి. ఆకాలమున హిందూదేశమున తప్ప మఱెచ్చటను ప్రత్తి పండుచుండుటలేదు. ఈజిప్టులోగాని టర్కీలోగాని యది పండుచుండునట్లు కానరాదు. అట్లుగాదేని "హిందువులు చెట్లపైనపండు ఉన్నితోఁ జేయబడిన వస్త్రములను ధరింతురు" అని గ్రీకులు వ్రాసియుండరు. ధనవంతులు అందు ముఖ్యముగా స్త్రీలు పట్టుబట్టలు ధరించుచుండిరి. × రాజాంతఃపురములలోని స్త్రీలు "పీతకౌశేయ వాసినులు" గా వర్ణింపఁబడి యున్నారు. పురుషులుకూడ పసపుపచ్చనబట్టలు ధరించుచుండినట్లు కానవచ్చుచున్నది. మనదేశములోని కాశ్మీరము, పంజాబు, గాంధారములలో బహుశః ఉన్నిబట్టలుకూడ వాఁడబడుచుండెడివి. భర

× సుభద్ర మొట్టమొదట వచ్చి గోపాలిక వేషమున ద్రౌపదితోఁ గలసికొనినప్పుడు ఆమె ఎఱ్ఱని పట్టుపుట్టమును ధరించియుండెను. శ్లో॥ సుభద్రాంత్వరమాణాశ్చ రక్తకౌశేయవాసినీం । పార్థః ప్రస్థాపయామాస కృత్వా గోపాలకావపుః ॥ ఆది॥ ౨౨౧॥ ౧౯.

తుని తాతయగు కేకయరాజు మనుమనికి కంబళాజినములనేక
ములు బహుమానపూర్వకముగా నిచ్చినట్లు రామాయణము
నందున్నది. ఇప్పటికాలమున నెట్లో యట్లే క్షాత్త్రయుగము
నందును † సొగసైన నేతయును, మిగుల వెచ్చఁదనమును గల
ఉన్నిశాలువలకు పంజాబు కాశ్మీర దేశములు ప్రసిద్ధి వహించి
యుండవచ్చును. నూలుబట్టలు వీనికంటెనెక్కువ సన్నని నేతఁ
గలిగియుండి రాణివాసమువారును, గొప్పవారును ధరించుటకు
దగినవిగా నుండెనని భారతరామాయణములు చెప్పుచున్నవి.

నూలు, పట్టు, ఉన్నితో మాత్రమేకాక గడ్డితోఁగూడ
వస్త్రములు నేయబడుచుండెనని వీరకావ్యములవలనఁ దెలియు
చున్నది. వీనిని తాపసులు ధరించుచుండిరి. సీతారాములు
తాపసవేషముతో నరణ్యమునకుఁ బోవునపుడు వారుకుశనిర్మిత
ములగు వస్త్రముల ధరించియుండిరి. అట్లే పాండవులరణ్యవాస
మునకుఁజనినపుడు ఆజినములను ఉత్తరీయములుగా వాడుకొని
రి. × ధృతరాష్ట్రుడు వానప్రస్థుఁడు గాన నరణ్యమునకుఁబోవు
వేళ వల్కలాజినములను ధరించెను. ‡ ఋషులును ఇతరతాప
సులును వల్కలాజినధారులుగా వర్ణింపఁబడియున్నారు. ఒక
వీరకావ్యములలోనేకాక, వానితరువాత రచింపఁబడిన వందల

† సానూనబృహతీగౌరీసూక్ష్మకంబలవాసిని॥కర్ణ॥౪౪॥౧౩

× శ్లో॥ తతఃపరాజితాః పార్థాః వనవాసాయదీక్షితాః । అజినాన్యుత్తరీయాణి జగృహుశ్చ యథాక్రమం॥సభా॥౭౭॥౧

‡ శ్లో॥ అగ్నిహోత్రంపురస్కృత్య వల్కలాజినసంవృతః । వధూజనవృతో రాజానిర్యయౌ భవనాత్తతః॥ఆశ్రమ(౧౫॥౩



కొలఁది గ్రంథములలో తాపసులు ధరించు వల్కలాజినములు
వచ్చినవి. కాని ఇట్టివస్త్రములు ఏగడ్డితోఁ జేయబడుచుండెనో
ఎట్లు జేయఁబడుచుండెనో కానరాదు. ఇప్పటి కాలమున
మాత్రము మనదేశమున కేవలము గడ్డితో జేయఁబడువస్త్రము
లు ఎచ్చటను కానబడవు. అయినను ఒకప్పుడు మనదేశమందు
గడ్డితోఁజేయఁబడు వస్త్రములుండెననుసంగతిమాత్రము నిజము.
"ఈ హిందువులు గడ్డితో చేయఁబడు బట్టలను గట్టుకొనెదరు.
వారు నదులలో రెల్లును గోసి తెచ్చి చీల్చి చాపవలెనల్లి వస్త్ర
ముగా ధరింతురు." అను హిరోడోటను వ్రాత పైయంశమును
బలపఱచుచున్నది.



# క్షాత్రయుగమునాటి హిందార్యులు-
# వారియాహారము.

---

మనపూర్వులగు హిందార్యులు క్షాత్రయుగమున నెట్టి వస్త్రముల ధరించుచుండిరో మా మొదటివ్యాసమునఁ జూపియున్నాము. ఆకాలమున వారెట్టి యాహారమును భుజింపుచుండిరో, క్షాత్రయుగారంభమునుండి దద్యుగాంతమువఱకు వారి యాహారమున నెట్టిమార్పులు కలిగెనో ఈవ్యాసమునఁ దెలుపుట మాయుద్దేశము. ఇట్టిమార్పులను మనకుఁ జూపు ముఖ్యగ్రంథములు ఉపనిషత్తులు, వీరకావ్యములు, మనుస్మృతియునై యున్నవి. మనవారిలో వాటిల్లిన యీమార్పులు ఒకదృష్టికి అభివృద్ధిసూచకములేయైనను వేఱొకదృష్టితోఁ జూచినపక్షమున నవిమనవారి హీనదశకుఁగూడ కారణములైనవని యనేక విద్వాంసు లభిప్రాయపడుచున్నారు. నైతికాధ్యాత్మికబుద్ధితో నాలోచించినయెడల, మతసంబంధమగు నుద్దేశముల ప్రేరణచేత మాంసాహారమును త్యజించి శాకాహారము నవలంబించిన వారు మన కెంతయు వందనీయులనుటయందు సందేహముండునా? ఉండదు. కాని పారమార్థికదృష్టితో నాహారమునందు వారుచేసికొనిన యీమార్పు వారిని రాజ్యాంగస్వాతంత్ర్యమునుండి దూరగులఁజేసిన మాటఁదలఁచినపుడు యీమార్పు వారికనర్థదాయక



ముగాఁ బరిణమించినదికాని లాభప్రదముకాలేదను సంగతిని మోక్షమూలరువంటివాఁ డొప్పికొని యున్నాఁడు. పైనఁ జెప్పబడిన మార్పెట్లు కలిగినదో వీరకావ్యములనుబట్టి యోచించుటకు ముందు, బృహదారణ్యకోపనిషత్తునందలి యీక్రిందివాక్యము మా చదువరుల శ్రద్ధనాకర్షింపదగియున్నది. "విద్వత్సభలందజేయుఁడుగను, సర్వజనప్రీతికరముగ నుపన్యసించు వక్తగాను, వేదార్థమును బోధింపఁగలవాడుగను, దీర్ఘాయువుగను నుండు పుత్రుని బడయగోరువాఁడు నేతితోను (గొడ్డుదైనను సరే గొఱ్ఱెదైననుసరే) మాంసముతోను వండబడిన యన్నమును దినవలయును." ఇట్టి యన్నమును దినుటవలన పైవచనమున నున్న ఫలము లభించునా లభింపదాయను విషయమున మేము వాదము సల్పఁబూనుకొనలేదు. కాని ఈవాక్యమునుబట్టి చూచినచోఁ గొడ్డుమాంసమును దినువారు శారీరక బలమునందు మాత్రమేకాక మానసికబలమునందు గొప్పవారగుదురని ఆకాలపువారు నమ్మియుండిరనుట స్పష్టముగా మాత్రము తెలియుచున్నది. కనుక ఆకాలపువారికి మాంస మాహారమైయుండెననియు, పైనఁజెప్పినమాంసము మేదస్సునకుఁగూడ బలము నిచ్చునదియని వారెంచుచుండిరనియు తేలుచున్నది.

మహాభారతముకూడ పైయంశమునే బలపరచుచున్నది. యుద్ధానంతరము ధర్మజుఁడొనర్చిన యశ్వమేధసందర్భమున, వ్యాసుఁడు పశుపక్షులు ముఖ్యముగా ఎద్దులు, జలచరములు యజ్ఞకార్యముకొఱకు మంచివని వచించియున్నాఁడు. ¶ అంతే

---

¶ తంతం దేవం సముద్దిశ్య, పక్షిణః పశవశ్చయే, ఋషభాశ్శాస్త్రపఠితా,

కాదు. ఆయజ్ఞసమయమున, జంతువులమాంసముతో వండఁబడిన వివిధ మధురాహారములకు మితమే లేకుండెననికూడ చెప్పఁబడియున్నది. † వేలకొలఁది బ్రాహ్మణులును లక్షలకొలఁది క్షత్రియులును భుజించుటకై యేర్పరుపఁబడిన విందులం దనేక పశువుల మాంసము వండఁబడియుండవలయుననియు, చంపఁబడిన జంతువులసంఖ్యనుబట్టియేమి, వాడఁబడిన ‡ మద్యభాండముల సంఖ్యనుబట్టియేమి అప్పటి మన హింద్వార్యులవిందులకును వారి సోదరులగు జర్మనీదేశీయుల విందులకును విశేషభేదముండలేదనియు చెప్పినచో నందు అసంగతమేమియునుండదు.

మహాభారతమునకు ఇప్పటియాకారము నొసఁగిన సౌతి, వైష్ణవ జైన బౌద్ధమతములు వృద్ధిఁజెందిన తరువాతివాఁడు; కనుక పైనఁజెప్పినవిందుల వివరములు అతనికి వింతగాఁదోఁచియుండవచ్చును. కావుననే యాతఁడు, తరువాత వచ్చిన యధ్యాయమునందు అట్టి విందులను నిరసించినాఁడు. ఈ యధ్యాయమున బంగారుతలగల యొక నకులము (ముంగిస) కథ వచ్చినది. మాంసాహారమును, జంతువులబలులను దూష్యములుగాఁ జూపి, యవిగల యజ్ఞములకంటె ఆఁకలిఁగొన్న యతిథికి పిడికెడటుకులు పెట్టిన నెక్కువపుణ్యమువచ్చునని నిరూపించుటకై

స్తథాజలచరాశ్చయే, సర్వాన్ప్రానభ్యయంజస్తే, తత్రాగ్నిచయ కర్మణి॥ అశ్వ॥

† భక్ష్యభాండవరాగాణాం క్రియతాంభుజ్యతాంతథా, పశూనాంవధ్య తాంచైవ నాంతందదృశిరేజనాః॥ అశ్వ॥

‡ సురామైరేయసాగరః॥ అశ్వ॥



ఈకథ యచ్చట తెచ్చిపెట్టబడినది. క్షాత్రయుగారంభము నుండి యాయుగము ముగియునాఁటికి జనులయభిప్రాయము లేవిధముగా మారినవో పైకథవలనఁ దెల్లమగుచున్నది.

జనాభిప్రాయ మెట్టిమార్పుఁ జెందినను క్షత్రియులు మాత్రము నేఁడెట్లో యట్లే ఆకాలమునందును పూర్వాచారమును వదలక మాంసాశనమును జంతువుల బలులను జరపుచునే యుండిరి. పైదాని తరువాతయధ్యాయమున అప్పటి జనాభిప్రాయమును కొంతసమాధానపఱచుటకై యియ్యఁబడిన ప్రత్యుత్తరమొకటి మనకు కానవచ్చుచున్నది. వ్యాసాదిమహర్షుల నియోగముననుసరించి ధర్మరాజుచేసిన యా యజ్ఞకార్యమును నకులమెట్లు నిందింప సాహసించెనని జనమేజయుఁడు ప్రశ్నవేయఁగా వైశంపాయనుఁ డిట్లు చెప్పుచున్నాఁడు. పూర్వమొకప్పుడు ఇంద్రుఁడు యజ్ఞము చేయుచుండ పశువధ జరగఁబోవు సమయమున అచ్చటనుండిన ఋషులు యజ్ఞపశువుల జాలిఁగొలుపు చూపులఁ జూచి దయఁదలఁచి 'పశుహింస అధర్మకార్యము కనుక ఈ యాగము సధర్మమైనదికాదు' అని ఇంద్రునితో ననిరి. * ఇంద్రుఁడు వారితో నేకీభవింపనందున యజ్ఞములందు జంతువులను వధింపవచ్చునా కూడదా యను విషయమున ఇంద్రునకును ఋషులకును వాదము కలిగెను. అంత వారి వివాదాంశమున చేదిదేశపు రాజగు వసువుయొక్క తీర్మానమును గోరిరి. ఏది దొరకిన దానితోనే యజ్ఞము చేయవచ్చునని వసు

* నాయంధర్మకృతోజ్ఞా నహింసాధర్మఉచ్యతే, యజబీజైఃసహస్రాక్ష త్రివర్ష పరమోషితైః॥ అశ్వ॥

వు నిర్ధారణచేసెను. ఈ యంశము నింతనిర్లక్ష్యముగా తీర్మానిం
చినందున చేదిరాజు అధోగతిపాలై పాతాళమునకుఁ బోయెను”
కాని యీవివాద మింతటితో ముగియలేదు. జనసామాన్యము
జంతువులకు మాఱుగా నితరపదార్థములను యజ్ఞసహాయములం
దర్పించి తృప్తినొందుచుండిరి. కాని క్షత్రియులు మాత్రము
తమ పూర్వపద్ధతిని మానలేదు. కనుకనే క్షత్రియుఁడైనవాఁడు
తన సార్వభౌమత్వమును జాటఁగలిగినప్పుడెల్ల ధర్మజ జనమేజ
యులవలె నశ్వమేధముఁ జేయుచునే యుండెను. అశోకునివంశ
మంతరించిన తరువాత హిందూచక్రవర్తియగు పుష్యమిత్రుఁడు
అశ్వమేధయాగము చేసెను. ఈవిధముగా యజ్ఞములందు జరగు
హింస న్యాయమైనదేయని బ్రాహ్మణు లొప్పుకొనవలసినవా
రైరి. దీని తరువాత యధ్యాయమున అగస్త్యుని యజ్ఞప్రకథ
కలదు. ఈజన్నము పండ్రెండు వత్సరములు జరగుచుండెను.
దీనియందు నిర్జీవపదార్థములే యాహుతి యియ్యబడెను. అంత
నింద్రుఁ డాగ్రహించి వర్షింపమానుకొనెను. యజ్ఞాదులకు ధా
న్యమైనను దొరకదేమో కదా యని ఋష్యాదులు భయపడి,
అగస్త్యుని యొద్దకుఁ బోయి మొఱపెట్టుకొనిరి. అగస్త్యుఁడు
చేయునదేమియులేక, ధాన్యమే లభింపనియెడల తాను మాన
సిక యజ్ఞముచేసెదననియు, కాకపోయినచో ఉత్తర కురుభూ
ములకు బోయి ద్రవ్యముఁ దెత్తుననియు, అదియును కాదా
తానే యింద్రత్వమునువహించి భూమిని సస్యవంతముగఁ జేసెద
ననియుచెప్పి యట్లే తన మహాత్మ్యమువలన ద్రవ్యము నుద్భవిం
పఁ జేసెను. ఇంద్రుఁ డచ్చెరువొంది తన్ను క్షమింపుమని యగ



స్త్యుని వేడికొని ఎప్పటివలె వర్షముఁ గుఱిపించెను. దేవతలతోడి
వైరమున తమ తపోధనమును వృథ చేసికొనుట మంచిపనికాదు
కనుక యాగములలో జరగు పశుహింస హింసయేకాదని విధింపు
మని అగస్త్యుని ఋషులు వేడికొనిరి. అతఁడు వారివిన్నపము
అంగీకరించెను. ఋషులు స్వస్థానములకుఁ బోయిరి. ఈసమయ
మున జంతువుల బలుల కనుకూలమ్ముగ నభిప్రాయము మాఱి
నది కనుకనే అశ్వమేధపర్వమునందలి తుదియధ్యాయమున వెను
కటి స్థితిగతులుపోయి, ధర్మజుని యాగమును నిందించిన యా న
కులము నిజముగా నకులముకాదనియు, యముఁడు జమదగ్ని శా
పవశమున నకులాకారమును ధరించెననియు, యుధిష్ఠిరునియాగ
మును దూఱినప్పుడు శాపనివృత్తి కలుగవలసిన విధానముం
డెను కనుక యాగమునునిందించుట సంభవించినదనియు చెప్పఁ
బడియున్నది.

మాంసాహారమును గుఱించియు, యాగములందు పశు
హింస జరగుటను గురించియు జనుల యభిప్రాయము లెట్లుమా
రినవో చూపుటకై మేము నకులము యొక్క కథను కొంత
దీర్ఘముగ వ్రాయవలసినవారమైతిమి. ఈ నకులముయొక్క కథ
మనవారి యాహారవిధానముయొక్క మూఁడు దశాభేదములను
దెలుపుచున్నది. మొదట మాంసాహారులుగాను జంతువులను
బలి యిచ్చువారుగను నున్న హింద్వార్యులు ఆపద్ధతినివదలి
అహింసా సిద్ధాంతము నవలంబించి రెండవదశకువచ్చిరి. ఆ రెండవ
దశనుండి మరల యాగాదులందు హింసజరుగవచ్చును. అను
సిద్ధాంతము నొప్పుకొని మూఁడవదశకు వచ్చిరి. ఈవిధముగా

క్షాత్రయుగాంతమునాఁటికి స్థిరపడిన నీమూఁడవ యభిప్రాయమే ఇప్పటికాలమున పశుహింసతోఁగూడిన యాగములు విశేషముగాఁ గానరాకపోయినను, క్షాత్రయుగాంతమునుండి యభిప్రాయమే యిప్పటికి స్థిరమైయున్నదనుట స్పష్టము. ఆహారవిషయమునను క్షాత్రయుగాంతమునాఁటి యభిప్రాయములే నేఁడును నిలచియున్నవి. అనఁగా నేఁటికిని క్షత్రియులును, హింద్వార్యులలోను మిశ్రార్యులలోనుజేరిన కొన్ని బ్రాహ్మణజాతులవారును మాంసాహారమునే భుజించుచున్నారు.

అయినను, ఒకవిషయమున మాత్రము కడపటివాక్యమునఁ జేర్కొనఁబడినవారు తక్కుంగల హిందువుల మార్గము ననుసరింపక తప్పలేదు. అదేదన గోవధము. హిందువులలోని వివిధశాఖలవారెట్లు గోవృషభవధమును మహాపాతకములుగ గణించుచుండిరో పైవారును నట్లే తలఁచుచుండిరి. * ఈనిషేధమెప్పుడు విధింపఁబడినదో తెలియదు. క్షాత్రయుగారంభమున మన హింద్వార్యులు గోవృషభములను బలియిచ్చుచు, వానివాని మాంసమును దినుచుండిరనుట నిర్వివాదాంశము. ఈసిద్ధాంతమును బలపరచు వాక్యములు మహాభారతమం దెన్నియో కలవు. అనేక యాగములచేఁ బ్రసిద్ధిగాంచిన రంతిదేవుడు బలి

* అర్జునుని శపథసందర్భమును జూడుడు:—

బ్రహ్మఘ్నానాంచయేలోకా, యేచగోఘాతినామపి, పాయసంహి యవానంహి శాకంకృసరమేవహి, సంయావాపూపమాంసాని యేచ లోకావృథాన్నతాం॥ ద్రోణ॥



యిచ్చుచుండిన వృషభముల * చర్మముల కుప్పలోనుండి యొకనది యుత్పత్తియయ్యెననియు, దానికి చర్మావతీ (చేంబలు) యను సార్థకనామము వచ్చెననియు, మహాభారతముననున్నది. ఇఁక గొడ్డుమాంసమును దినుచుండిరను విషయమున, కావలసినచో భవభూతి కృతమగు 'ఉత్తరరామచరిత్ర'లోని వశిష్టవిశ్వామిత్రుల శిష్యుల సంభాషణము చూడఁదగును. ఈసంభాషణమున వశిష్టుని యాతిథ్యమునకై మధుపర్కముకొరకు చిన్నయావు నొకదానిని వధించిన విధమును తెల్లగడ్డముగల యాజడదారియెదుట నాయావు, పులిముందుబడిన మేకపిల్లవలె, గుటుక్కున మాయమైన విధమును వర్ణింపఁబడి యున్నది. స్థితిగతు లట్లుండగా క్షాత్రయుగాంతమునాఁటికి గోవృషభములు ఆహారరూపమున మనవారి కుక్షులలోఁబడకుండ నెట్లుతప్పించుకొనఁగలైనో తెలియవచ్చుటలేదు. ఎట్లయిననేమి! క్షాత్రయుగాంతమునాఁటికి వానికాయవస్థ తప్పినది. ఎందుచేతనోకాని గ్రీకులు ఈనిషేధము వ్రాయలేదు. అప్పటికాలపువారు శాకాహారులుగా నుండిరనియు, జంతువుల బలియిచ్చుట వారేవగించుకొనుచుండిరనియు గ్రీకులుకనిపెట్టిరి. "హిందూదేశీయులు సాధారణముగా ధాన్యముతిని జీవించెదరు; నేల దున్నెదరు. కాని పర్వతప్రాంతములవారు మాత్రము వేటాడిన జంతువుల మాంసముఁ దిను

* రంతిదేవునియింట దినమునకు ౧౦౦౦ పశువులు చంపబడుచుండెనని చెప్పబడియున్నది:—

ఆలభంతతదాగావః, సహస్రాణ్యేకవింశతిః । తత్రస్మసూదాక్రోశన్తి, సుమృష్ట మణికుండలాః । సూపంభూయిష్టమశ్నీధ్వం, నాద్యమాంసంయథాపురా॥ ద్రోణ॥

మంగురు" అని 'పరియాను' వ్రాసియున్నాఁడు. దీనినిబట్టి చూడ, ఇప్పటివలెనే ఆకాలమునఁగూడ హిమాలయప్రాంత వాసులు మాంసమును దినుచుండిరనియు మైదానములలో నుండువారు శాకాహారులుగా నుండిరనియు తెలియుచున్నది. 'వేటాడిన జంతువులు' అనుటవలన గోవధ నిషిద్ధమైనట్లు కొంత గోచరమగుచున్నది. కాని పరదేశీయులదృష్టి నాకర్షింపవలసిన యీయంశము గ్రీకులకేల స్పష్టముగా స్ఫురింపలేదో తెలియరాకున్నది. వారు వ్రాసిననేమి వ్రాయకపోయిననేమి? నేఁడెట్లో క్షాత్త్రయుగాంతమునఁగూడ నట్లే గోవధ మహాపాతకముగా నెంచఁబడుచుండెననుట నిస్సంశయము.

మహాభారతము నచ్చటచ్చట కానవచ్చు నస్పష్ట చిహ్నములను బట్టి గోవధానిషేధచరిత్రమును కొంచెము కనుఁగొందము; నహుష సప్తర్షులకథలో, సప్తర్షులు యాగములందు గోవధ క్రమమైనదేయని వాదించుచుండ, నహుషుఁడది యక్రమమని వాదించును. అనఁగా సప్తర్షులు క్షాత్త్రయుగమునాఁటి పూర్వాచారపరాయణుల భావముల వ్యక్తీకరించినారు; నహుషుఁడు సంస్కార వాదుల యభిప్రాయములను ప్రకటించియున్నాఁడు. "గోవులను బలియియ్యవచ్చునని చెప్పు వేదమంత్రములను నీవు నమ్ముదువా?" యని నహుషుని అగస్త్యుఁడడిగెను. * "నేను నమ్మ"నని నహుషుఁడు ఉత్తరమిచ్చెను. ఋషులిట్ల

* యఇమే బ్రహ్మణా ప్రోక్తా, మంత్రా వై ప్రోక్షణే గవామ్, ఏతే ప్రమాణం భవతః, ఉతాహో నేతి వాసవ॥ నహుషో నేతి తానాహ తమసా మూఢచేతనః, ఋ. ఉ. అధర్మే సంప్రవృత్తస్త్వం, ధర్మం న ప్రతిబుధ్యసే। ప్రమాణేతదస్మాకం, పూర్వప్రోక్తం మహర్షిభిః॥ ఉద్యో॥



నిరి. "నీవధర్మమార్గమున నున్నావు. అనుశ్రుతముగా వచ్చుచున్న మతము నీవొప్పుకొనకున్నావు" తరువాతజరిగిన వాదవివాదమున నహుషుఁడు అగస్త్యుని తలమీఁదఁగొట్టి, శాపవశమున మర్త్యలోకమున సర్పమై జన్మించెను. నకులము కథలో జంతుహింసకు ప్రతికూలుఁడుగా నున్న అగస్త్యుఁడు ఈసందర్భమున జంతుహింసకు అనుకూలుఁడుగా నుండుట విచిత్రముగానున్నది. పైన వివరింపఁబడిన శ్లోక వ్యాఖ్యానమున గోవుయొక్క పావిత్ర్యము ఏర్పడినకారణము చూపబడియున్నది. యాగసంబంధములగు మంత్రములకు బ్రాహ్మణుఁడెట్లు ఉనికిపట్టో యట్లే యజ్ఞద్రవ్యములగు క్షీరము, నేయి మొదలగు వానికి ఆవులునికిపట్టులు కనుక ఆవులను వధింపఁగూడదని నహుషుఁడుతలఁచెనట. గోవధానిషేధమునకు మరియొక కారణముఁగూడనుండవచ్చును. కృష్ణునకు గోవులు ప్రియతమములగుటవలన కృష్ణారాధనముతోఁబాటు గోవుల గౌరవముకూడ హెచ్చియుండవచ్చును. ఇంకొక సంగతికూడ గమనింపఁదగియున్నది. ఇరానియనులు గోవుల పావిత్ర్యమును అమ్ముచుండిరి. కనుక సింధునది యావలినుండి అప్పుడప్పుడు వచ్చుచుండిన యార్యులతోఁగూడ నీయభిప్రాయము దేశమునందంతట ప్రవేశించియుండవచ్చును. ఎట్లువచ్చిననేమి? గోవధానిషేధము క్షాత్త్రయుగములోనే వచ్చినదనియు అది కొంతకాలమువఱకు వాదవివాదములకు గుఱియై ఆయుగాంతమువఱకు స్థిరపడినదనియు మనము నమ్మవలెను.

వీపులమీఁద బరువులనుమోసికొనిపోవు జంతువులమాంసము తినఁగూడదని మన దేశమందొక నియమముండెను. మహా

భారతమున నిట్టి మాంసమునకు 'పృష్ఠమాంస' మని పేరు. బరువులుమోయు జంతువులయెడల జనులకుగల కృతజ్ఞతవలన నీనియమము పుట్టియుండవచ్చును. ఈ కారణము వృషభములవధకు వర్తించునుగాని గోవధకు వర్తింపదు. అంతేకాక గుఱ్ఱపుమాంసము ఆకాలమున నిషిద్ధముగా నుండలేదు. గుఱ్ఱముకూడ బరువులను మోసికొనిపోవు జంతువేకదా. కనుక పృష్ఠమాంససిద్ధాంతము తర్కమునకు నిలువఁజాలదు.

గోమాంసముమాత్రమేకాక బ్రాహ్మణ క్షత్రియులుతినఁగూడని మాంసముల విధములు ఇంకనుగలవు. "ఐదునఖములుగల యైదుతెరగతుల జంతువుల మాంసమునుమాత్రమే బ్రాహ్మణ * క్షత్రియులు తినఁదగినది" యని రామాయణమున నొక ప్రసిద్ధశ్లోకము కలదు. దీనినిబట్టి చూచితిమేని బ్రాహ్మణులు మాంసాహారమును దిను విషయమున మతే నిర్బంధముండెనట్లు కానరాదు. ఇట్లుండియు, మహాభారతమున నొకచోట త్యాజ్యములగు జంతువులు పేర్కొనఁబడినవి. శాంతిపర్వములోని ౩౬వ అధ్యాయము "బ్రాహ్మణుఁడు తినఁగూడని మాంసమేది?" యని ధర్మరాజు భీష్మునడుగును. దీనికి భీష్ముడిచ్చిన ప్రత్యుత్తరమిది † "ఎద్దులను, మంటిని (?) చిన్న పిపీలకలను,

* పంచపంచనఖాభక్ష్యా, బ్రహ్మక్షత్రేణ రాఘవ, శల్యకః శ్వావిధో గోధా. శశః కూర్మశ్చ పంచమః॥

† అనడ్వాన్ మృత్తికాచైవ, తథాక్షుద్రపిపీలికాః, శ్లేష్మాతజ స్తథా విప్రై, రభక్ష్యం విష మేవ చ। అభక్ష్యా బ్రహ్మణై ర్మత్స్యాః, శల్కై ర్యే వై వివర్జితాః। చతుష్పాత్కచ్ఛపాదన్యే మండూకా జలజాశ్చ యే। భాసా హంసాః సుపర్ణాశ్చ, చక్రవాకాః ప్లవా బకాః। కాకో మద్గుశ్చ గృధ్రశ్చ,



మలినపదార్థములలో జన్మించు పురుగులను, విషమును బ్రాహ్మణులు తినఁగూడదు. పొలుసులేని చేపలను, తాబేళ్లను తప్ప కప్పలవంటి చతుష్పాత్తులగు జలచరములనుగూడ వారు భుజింపఁగూడదు. భాసములను, హంసలను, సుపర్ణములను, చక్రవాకములను, ప్లవములను, కొంగలను, కాకులను, మద్గులను, గ్రద్దలను, శ్యేనములను, గుడ్లగూబలను, మాంసమును భక్షించునట్టి వదునైన పొడుగుపాటి కోరలుగల చతుష్పాత్తులను, రెండు దంతములుగలట్టియు నాల్గుదంతములుగలట్టియు పక్షులను వారు తినఁగూడదు." దీని తరువాత, తక్కిన విధములగు మాంసములను బ్రాహ్మణులు తినవచ్చునని చెప్పఁబడియున్నది. ఇట్టి యనుకూల ప్రమాణము లుండినప్పటికిని సూత్రయుగాంతము నాఁటికి హిందార్యులును, మిశ్రార్యులును పూర్వాచారపరాయణులగు క్షత్రియులుతప్ప తక్కిన వారందరును, క్రమముగా మాంసాహారమును మానివేయుచుండిరి. ఆధ్యాత్మికజీవనముకలవారు మాంసమును త్యజించి తీరవలయునను విధానముండెనట్టు కానవచ్చుచున్నది. "మాంసాహారమును మద్యపానమును మానవునకు సహజములగు కోరికలు కనుక వానిని వాడుకొనవచ్చును. అయినను వానిని వదలిపెట్టుట మహాలాభప్రదము" * అని మ

శ్యేనోలూకాంతథైవచ॥ క్రవ్యాదాంష్ట్రిణః సర్వే చతుష్పాత్పక్షిణశ్చయే యేషాంచోభయతోదంతా, చతుర్దంష్ట్రాశ్చసర్వశః॥ 'మృత్తికా' విషము అనువానికి 'నేల' విషము అని అర్థము వ్రాసినాము వీనినిజమైనభావమేమో తెలియదు.

* నమాంసభక్షణే దోషో, నమద్యే న చ మైథునే, ప్రవృత్తిరేషా భూతానాం నివృత్తిస్తు మహాఫలాః॥

నువు వచించియున్నాడు. మాంసము తినవచ్చునా తినఁగూడదా యను ప్రశ్న క్షాత్రయుగాంతప్రాంతమున జనులమనస్సును చాల కలవరపఱచినట్లున్నది. ఇట్టి తర్కవితర్కములకు ముఖ్యకారణము అప్పుడు ప్రచారమునందుండిన అహింసాసిద్ధాంతమే. అనుశాసన పర్వములోని ౧౧౫ వ అధ్యాయమునందు యుధిష్ఠిరుఁడు ఇట్లు భీష్మునడిగెను. "అహింస పరమధర్మమని మీరు చెప్పుచున్నారు. శ్రాద్ధసమయమున పితృదేవతలకు మాంస మర్పింపవలయునని మీరే చెప్పుచున్నారు. హింసలేకుండ మాంసమెట్లు వచ్చును? మాంసాహారమువలన కలుగు పాపమేది? దానిని వర్జించిన వారి కబ్బు పుణ్యమెట్టిది? జంతువును వధించి దాని మాంసమును దినిన వారి కెంతదోషము? ఇతరులు చంపితెచ్చిన మాంసమును తినిన వారి దోషమెట్టిది?" ఈప్రశ్నములకు భీష్ముని యుత్తరములఁ జూడుఁడు. "తేజమును, ఆయువును, బుద్ధిని, బలమును, మేధాశక్తిని కాంక్షించువాఁడు హింసమానవలెను. మద్య మాంసములను వదలినవాఁడు ప్రతిమాసమున నశ్వమేధము చేసిన వానికి లభించు పుణ్యము పొందును. ఇతరప్రాణుల మాంసము చేత శరీరమును పెంచుకొనువాఁడు తప్పకదుఃఖమును బొందునని నారదుఁడు వచించియున్నాడు. తనను ఎవరైన హింసించినపుడు ఎట్టి బాధ కలుగుచున్నదో అట్టి బాధయే జంతువులను హింసించు నపుడు వానికిని కలుగుచున్నదని తలంచవలెను. మాంసముకొరకే జంతువులు హింసింపఁబడుచున్నవి. హింసార్థము ధనమిచ్చువాఁడును, ఒకఁడుచంపి తెచ్చినమాంసమును తినువాఁడును, జంతువులను స్వయముగా చంపువాఁడును హింసా దోషమున



సమాసులు అయినను, ప్రాపంచికులకొఱకు మహర్షు లీవిధమున విధించియున్నారు. కాని మోక్షాసక్తుఁడగువాఁడు ఈ నియమములను పాటింపవలసిన పనిలేదు. దేవతల కర్పింపఁబడినదియు, పితరులకియ్యఁబడినదియు తప్ప తక్కిన మాంసము లన్నియు వర్జ్యములే. మాంసము తినవచ్చునని వచించిన వసురాజు స్వర్గమునుండి యధోలోకమునఁ బడి యటనుండి పాతాళము పాలయ్యెను. అగస్త్యుఁడు జనులపైనఁ దయదలచి వేటజంతువు ప్రోక్షితములని వచించెను. కనుక శ్రాద్ధములలో మాంసము నర్పింపవచ్చును. ముఖ్యముగా ఆశ్వీజమాస శుక్లపక్షమున మద్యమాంసములను ముట్టఁగూడదు. చాతుర్మాసములయందు వీనిని వర్జించినవాఁడు, యశము, దీర్ఘాయువు, బలము, విజయము అను వానిని పొందును. ఆశ్వీజమాసమున మాంసమును త్యజించుట వలననే నాభాగుఁడును, అంబరీషుఁడును స్వర్గమునకుఁ బోయిరి. మద్యమాంసములను త్యజించినవారు మునులనఁబడుచున్నారు."

పై వాక్యములవలన, మనకు అక్కాలపు జనులకు మాంసాహారముపై గలిగిన అసహనభావమును పూర్వాచారమును త్రోసిపుచ్చజాలక కొన్ని సమయములందు అట్టి యాహారమును వారు వాడుట కొప్పుకొనుటయును తెలియవచ్చుచున్నది. వారు జంతువులబలిని, వేటను తప్పుగాఁ దలఁపలేదు. వారు తినుచుండిన మాంసము దేవతల కర్పింపఁబడినట్టిదో వేటాడిన జంతువులదో యై యుండెను. రోమను కాథలిక్కులలోని "లెంటు" వలెనే అప్పటి క్షత్రియులుకూడ జనాభిప్రాయాను సారము: ఒక మాసమువఱకు మాంసమును వదలుచుండిరి.

రాను రాను బ్రాహ్మణులు పైతృకవిధులకొరకును బలులకొఱకును హింసచేయుచుండినను, మాంసాహారమును మాత్రము విసర్జించిరి. యజ్ఞశేషమగు మాంసమును అగ్నిలోఁ బడవేయసాగిరి. పితృదేవతారాధనమున మాంసమును దినుట పాతకముగా పరిగణింపఁబడ మొదలిడెను. * కొందరు క్షత్రియులు వేటాడుట వదలక పోయినను మాంసాహారమును సంపూర్ణముగ వదలిరి.

ఈ విధముగా హిందూజాతియంతయు మాంసాశనమునే కాక మద్యపానమునుగూడ త్యజించుట అత్యంత ఘనకార్యమనుటకు సంశయించు వారుందురా? మద్యపానాభ్యాసముయొక్క చరిత్రను పరిశీలించితిమేని, ఆరంభమున హింద్వార్యులకును వారి సోదరులగు జర్మనులకుండినంత మద్యపానాసక్తి

* పితృదేవతల తర్పణమునకు వివిధమాంసము లీక్రిందిశ్లోకములందు వర్ణింపఁబడియున్నవి. (అనుశాసనపర్వము)

ద్వౌమాసౌతుభవేత్తృప్తిర్మత్స్యైఃపితృగణస్యహ, త్రీన్మాసానావికేనా
విన్యతుశ్శాశ్వసంజ్ఞకేనహ॥
ఆజేనమాసాన్ ప్రీయంతే పంచైవ పితరోనృప, వారాహేణతు
షణ్మాసాన్ సప్తవైశాకునేనతు। మాసానష్టౌ పార్షతేన రౌరవేణ
నవప్రభో॥
గవయస్యతుమాంసేన తృప్తిఃస్యాద్దశమాసికీ। మాంసేనైకాదశప్రీతి
పిత్రూణాం మహిషేణతు॥
గవ్యేనదత్తేశ్రాద్ధేతు సంవత్సరమిహోచ్యతే। వ్యాఘ్రీణసస్యమాంసేన
తృప్తిర్ద్వాదశవార్షికీ। అలంత్యాయభవేద్దత్తంఖడ్గమాంసం పితృక్షయే



యుండెడిది. అలసియుండినప్పుడును, సంతోషమున నుండినప్పుడును కృష్ణార్జునులు మద్యపానము చేయుచుండిరని మహాభారతము మనకుఁ జెప్పుచున్నది. యదు వృష్ణులు మద్యపానరతులని మన మెఱుఁగుదుము. బలరాముని త్రాగుఁబోతుతనము మనకు క్రొత్తవిషయము కాదు. త్రాగుబోతుతనము యొక్క ప్రభావము వలన యాదవులంతకలహములపాలై తుదకు మడిసినసంగతి మనకు తెలిసినదే. సురాపానము చేయువారు సురలనియు, చేయనివారు అసురులనియు రామాయణము నందలి గంగాఖ్యానములోనున్నది. దండకారణ్యమునకుఁబోవుచు గంగానదిని దాటునప్పుడు, తాను ౧౪ సంవత్సరముల వనవాసమును నిరపాయముగా గడపి మరల వచ్చువేళ అనేకకుంభముల మద్యమును గంగాదేవి కర్పింతునని సీత మ్రొక్కుకొనినది. యుధిష్ఠిరిని యశ్వమేధ పర్వమునందు యజ్ఞప్రదేశము మద్యసముద్రముగా నుండెనని యున్నది. పై యంశములును, లెక్కకుమిక్కిలిగానున్న ఇతరములగు నుదాహరణములును కలసి, క్షాత్రయుగారంభమున మన హింద్వార్యులు సాధారణముగాను క్షత్రియులు ముఖ్యముగాను మద్యమును సేవించుచుండిరని మనకు రుజువుచేయుచున్నవి. కాని ఆ యుగము ముగియువఱకు హిందువులలో విశేషజనులు. ముఖ్యముగా బ్రాహ్మణులందఱును మద్యము వదలియుండిరి. కాని క్షత్రియులుమాత్రము ఇంకను పూర్వాచార శృంఖలములను తప్పించుకొనజాలరైరి. మద్యపానము పంచమహాపాతకములలో నొకటియయ్యెను. ఈపాతకములు ఉపనిషత్తులలోఁగూడ వచ్చి

నవి. * కనుక క్షాత్రయుగాదియందు బ్రాహ్మణులు ఈ నిషేధమును పాటించియుండిరేమో? అదెట్లుండినను, క్షాత్రయుగము లోపలమాత్రము వారు మద్యమును పూర్తిగా వదలుటయే కాక, దానిని ఆర్యేతరకార్యముగా భావించియుండిరనుట నిస్సంశయము. ఈ విషయమునుగూర్చిన యొక వచనము శాంతిపర్వములోని ౧౪౧ అధ్యాయమున విశ్వామిత్ర చండాలుర కథ యందున్నది. కఱవుకాలమున నొకనాఁడు విశ్వామిత్రుఁడు క్షుద్బాధాపీడితుఁడై యొకచండాలుని గృహము ప్రవేశించి చచ్చిన కుక్కకాలును తినుటకై తస్కరించెను. అప్పుడు విశ్వామిత్రునకును చండాలునకును, విశ్వామిత్రుని వర్తనమును గుఱించియు, బ్రాహ్మణుఁడగువాఁడు మాంసము తినవచ్చునాయనుటనుగుఱించియు నొక సంభాషణము జరుగును. సంభాషణాంతమున, ఆహారవిషయమున ఈ నియమమును పాటింపకపోయినచో దోషముకాదనియు, "పతిత" శబ్దము త్రాఁగుబోతు విషయమున మాత్రమే వర్తించుచున్నదనియు విశ్వామిత్రుఁడు చెప్పియున్నాఁడు. † శాంతిపర్వములోని ౧౮౦ వ అధ్యాయములో మోక్షధర్మప్రశంసయందు మఱియొక శ్లోకమున్నది. ఇంద్రుఁడు జంబుకరూపమున వచ్చి బాధితుఁడగునొక బ్రాహ్మణు నూఱడించుచు బ్రాహ్మణులగొప్పతనమునుగ్గడించుచునిట్లనును. "మద్యములత్వాకపక్షిమాంసము, ప్రపంచములోని సమస్తపదార్థములయందును ఎక్కువ రుచిగలవి అట్టివానినినీవు కలలోనైన" తలంపవు.

* ఛాందోగ్యోపనిషత్తు ౧౦ కాండము.

† వైవాతిపాపంభక్షమాణస్య దృష్టంసురాంతు పీత్వా పతతీతిశబ్దః॥



ఇట్టిసదభ్యాసము బ్రాహ్మణునకుహింద్వార్యులలో నున్నతస్థానము నొసంగిన కారణములలోనొకటి. అప్పుడును ఇప్పటివలెనే బ్రాహ్మణులలో కొందఱు వంచకులుగూడనుండిరి. మొత్తము మీఁద బ్రాహ్మణులయందున్న ఈసదాచారము తక్కినవారిని సన్మార్గమునకుఁద్రిప్పుటకు కారణమయ్యెను. కనుకనే "యాగాదులందు తప్ప వారెప్పుడును మద్యపానముచేయరు" అను మెగాస్తనీసు వచనమును స్ట్రాబో ఉదాహరించియున్నాఁడు. ‡

ఈప్రకారము క్షాత్రయుగమున హిందువులు గోహత్యను గోమాంసాహారమును పూర్ణముగ విడిచిపెట్టిరి. క్షత్రియులుతప్ప తక్కినవారందరు మద్యపానమును దాదాపుగా మానుకొనిరి. అయినను ఈ సిద్ధాంతమునకు కొన్ని నిషేధములు లేకపోలేదు. గంగానదీప్రాంతవాసులగు నార్యులు సంఘ, మతసంస్కారములందు పురోగాములై యుండ పంజాబుదేశపుటార్యులు పూర్వాచారపరాయణులై యుండిరి. కావుననే పంజాబువారిలో వివాహసంబంధములగు పూర్వాచారములనేకములుండెను. వారుజాతిభేదమునకు పూర్తిగాలోఁబడినవారు కారు. ఆహారపానీయములలోసైతము వారు తమతొంటిమార్గమును వదలలేదు, కావుననేగంగానదీప్రాంతవాసులు పంజాబువారిని నీతిహీనులుగాఁ దలఁచుచుండిరి. మహాభారతములోని కర్ణపర్వమునందు ఒకశ్లోకము కలదు. ¶ "గోవర్ధనమనునది మఱ్ఱిచెట్టు; సుభద్రయను

‡ ఇది సోమపానముకాఁబోలును, అని మాక్‌క్రిండల్ వ్రాసినాఁడు

¶ గోవర్ధనోనామవటః, సుభద్రంనామచత్వరం, ఏతద్రాజకులద్వారమావమూరాత్స్మరామ్యహం॥ కర్ణ॥

నది చత్వరము. ఇది చిన్నతనమునుండి నేనెఱిఁగియున్న రాజకులద్వారము" అని యాశ్లోకమున కర్థము. అనఁగా గోవధశాలయు, సురాభాండాశ్రయమును రాజమందిరద్వారమున తప్పక యుండునని దీని భావము. గోవధమును మద్యపానమును గంగానదీ ప్రాంతవాసులగు నార్యులు అసహనముతోఁ జూచుచుండిరి. ఇంకొక శ్లోకమున నిట్లున్నది. "బియ్యముతోఁ జేయబడిన మద్యమును ద్రావునట్టియు గొడ్డుమాంసమును ఉల్లిగడ్డలను, అపూపమాంసమును, వేయించిన ధాన్యమును తినునట్టి పంజాబు దేశవాసులు దుర్వర్తనము కలవారు." అప్పటివఱకును పంజాబు దేశపు స్త్రీపురుషులు గొడ్డుమాంసమునుదిని మైకమెత్తునట్లు మద్యమును ద్రావి రాత్రిందివములు స్వేచ్ఛావిహారము సల్పుచుండిన కారణమువలననే, గంగానదీ ప్రాంతవాసులగు నార్యులు వారిని హేయభావముతోఁ జూచుచుండిరి. పంజాబు దేశపు టార్యులు ఈవిధముగా వెనుకఁబడియుండినను కాలక్రమమున వారును గోవధను మహాపాతకముగా లెక్కించి తక్కుంగలవారి యభిప్రాయములతో నేకీభవించిరి.

ఆహారవిషయమున సర్వార్యజన సమ్మతమైయుండిన పై నియమమును పాటింపనిజాతి మఱియొకటి యుండెను. అది సారస్వత బ్రాహ్మణజాతి. పొలసులేని చేపలను త్రేతాయుగమునాఁటి బ్రాహ్మణుడు తినఁగూడదు. అట్టి యాచారమునకు విరుద్ధముగా నాఁటినుండి నేఁటివరకు మత్స్యములను దినుచుండు సారస్వత బ్రాహ్మణులయొక్క యాచారమును దెలుపుగాథ యొకటి శల్యపర్వములోని సరస్వత్యుపాఖ్యానమునఉన్నది. ఒకప్పుడు హిందూ



దేశమున ద్వాదశవర్షక్షామము మహాభయంకరముగా నుండెను. బ్రాహ్మణులు దేశదేశములకు వెడలిపోయిరి. అప్పుడు కొందఱు బ్రాహ్మణులు మాత్రము సరస్వతీ నదీతీరమున మత్స్యాహారవ్రతులై అటేయుండి వేదములను గాపాడిరి. క్షామము పోయిన తరువాత బ్రాహ్మణులు మరలవచ్చి సారస్వతుల వద్ద వేదములఁ జదివిరి. వంగదేశ బ్రాహ్మణులును శన్వీబ్రాహ్మణులును సారస్వతుల యాచారమునే ఇప్పటికిని అవలంబించియున్నారు.

ఆకాలమున హిందువులు సామాన్యముగా భుజించు నాహారము ధాన్యసంబంధమైనది. అందును వారు ముఖ్యముగా వరియన్నమును దినుచుండిరి. సాధారణముగా ధనవంతులును ముఖ్యముగా క్షత్రియులును మాంసముతోఁగూడ వండబడిన యన్నమును—ఈకాలమున పొలావు అనబడునట్టి దానిని—తినుచుండిరి. రాజసూయానంతరము దుర్యోధనుడు హస్తినాపురమునకువచ్చి పిమ్మట, ధృతరాష్ట్రుఁడు కుమారునిజూచి "పిశితౌదనమును దినుచున్న నీవు ఇట్లు శుష్కించుచున్నావేమి?" యని సభాపర్వమున నడుగును.* ఇదిగాక, త్రేతాయుగాంతరమున వివిధ జీవితావస్థలలో నుండిన హిందువులెట్టియెట్టియాహారమును భుజించుచుండిరో తెలుపు మఱియొక శ్లోకమున్నది. దానియర్థమిది. "ధనవంతులు మాంసము విశేషముగాగల యాహారమును, మాధ్యమికస్థితిగలవారు పాలును పాలతోఁ జేయబడిన వస్తువులు విశేషముగాఁగల యాహారమును, పేదవారు

* అచ్ఛాదయసి ప్రావారాన్నశ్నాతి పిశితౌదనం, ఆజానేయావహంత్యశ్వాః కేనాపిహరిణః కృశః॥ సభా॥

ఎక్కువగా తైలపక్వములను తినెదరు." $

వనపర్వమునందలి ౧౯౦ వ అధ్యాయమందున్న ఒకశ్లోకమును బట్టి చూచినచో, ఆర్యులు ఆరంభమున హిమాలయా పాదప్రాంతములందు నివాసము చేసి యుండిరనియు, అచ్చట వరిపంట యుండెననియు తెలియుచున్నది. అప్పుడుమాత్రమేగాదు. హిందూదేశపు ఉత్తరభాగములలోని పర్వతప్రాంతములు నేటికిని సువాసనగల వరిపంటకు పేరుగాంచి యున్నవి. ఆర్యులా ప్రదేశములనుండి వెడలి వానికంటె నెక్కువయుష్ణముగానుండు మైదానములలోనికి క్రమక్రమము ప్రవేశించిరి. ఈ క్రొత్తస్థలములు నాఁటికిని నేఁటికిని గోధుమలపంటలకును యవల పంటలకును యోగ్యములై యున్నవి. "యుగాంతమున జనులు యవలు గోధుమలు తిను స్థలములకుఁబోయెదరు." * ఈ శ్లోకార్థమును సమన్వయము చేయఁదలఁచినయెడల మనము పైయూహనే యాధారము చేసికొనవలెను. దుర్యోధనుని యాహారము విషయమున వచ్చినశ్లోకమునందలి "పిశితౌదన" శబ్దమునుబట్టి చూచితిమేని ధనవంతులగువారు గోధుమలకంటె బియ్యము నెక్కువగా వాడుచుండిరని తెలియుచున్నది.

హిందువులు మితాహారులు. హిందువులకు నిర్ణీతములగు భోజనసమయములేవని గ్రీకులు వ్రాసియున్నారు. ఈ యంశమును బలపఱచు వాక్యములు కొన్ని మహాభారతమునఁ

$ ఆఢ్యానాం మాంసపరమం మధ్యానాం గోరసోత్తరం, తైలోత్తరం దరిద్రాణాం, భోజనం భరతర్షభ॥ ఉద్యో॥

* యేయవాన్నాయనయదా, గోధూమాన్నాస్తథైవచ, తాన్ దేశాన్ సంశ్రయిష్యంతి యుగాంతే పర్యుపస్థితే॥ వన॥



గలవు. మాట్లాడకుండ భోజనముచేయుట మంచిదని మన హింద్వార్యులు తలఁచుచుండిరి, § కుటుంబమువారందఱు నొకమారే భుజించుచుండిరని తోఁచుచున్నది, విందువేళలందును యాగాదులందును భూరిసంతర్పణలు జరుగుచుండెనని చెప్పవలెను. ఆశ్వమేధసమయమున వేలకొలంది బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు భోజనమువలన సంతృప్తులైరని మహాభారతమునం దున్నది. నిర్ణీతకాలములందు భోజనముచేయని దురభ్యాసము మనయందు నేఁటికిని గలదు. విందుసమయములందు మధురాహారములు వడ్డింపఁబడుచుండెను. "శాకములనువండు వంటవాండ్రును మధురపదార్థములను వండువాండ్రును ఎప్పటివలెనే ధృతరాష్ట్రుని సేవయందుండిరి." ౨ ఈశ్లోకమునుబట్టి ధనవంతులు మధురపదార్థములను ఎల్లప్పుడును తినుచుండిరని తెలియుచున్నది. దుర్యోధనుని పాలనమునాఁటివలెనే యుధిష్ఠిరుని పాలనయందుసైతము అమర్పఁబడుచుండిన మధురపదార్థము లేవియో చెప్పుటకు వీలులేదు. * శర్కర, అల్లము మొదలగు వస్తువులతోఁ జేయఁబడు తియ్యని పదార్థములను, కూరగాయలను వండుటయందు తెలివిగల వంటవాండ్రను నర్థమిచ్చు వివిధశబ్దములను వ్యాఖ్యాత

§ ప్రాఙ్ముఖోసత్యమశ్నీయా ద్వాగ్యతోన్నమకుత్సయన్॥ అను॥

౨ ఆరాలికాః సూపకారా, రావికాండవికాస్తథా ఉపాతిష్ఠన్త రాజానం, ధృతరాష్ట్రం పురాయథా॥ ఆశ్ర॥

అపూపములు, ఖండవరాగములు (లేక రాగఖండవములు) అను రెండు విధములగు పదార్థములను మోదకములను అచ్చటచ్చట వచ్చుచుండును.

వివరించియున్నాఁడు. కూరగాయల ప్రసక్తిపలుతావులఁ గలదు. కాని యవియెట్టివో వ్రాయలేదు. ఉల్లిగడ్డలు, వెల్లిగడ్డలు సాధారణముగా పంజాబునందుమాత్రము వాడుకయందుండెనని యిదివఱకే చెప్పియున్నాము. ఇవి మధ్యదేశము వారికి నిషిద్ధములుగా నుండెను. పాలు అందఱును ఉపయోగించుచుండిరి. పాలవలన తయారగువస్తువులన్నిటిలో ఉత్తమపదార్థము నేయి యేయని 'ఘృతంశ్రేయో ఉరశ్చిత్:' అను వాక్యమువలనఁ దెలియుచున్నది.

---

# క్షాత్రయుగమునాఁటి హింద్వార్యులు

## వారి వివాహములు

క్షాత్రయుగారంభము నాఁటినుండి తద్యుగాంతమునాఁటి వరకు హింద్వార్యులు యాహారమునందు వాటిల్లిన మార్పులను వెనుకటి వ్యాసమునఁ జూపి యుంటిమి. సాంఘికాచారములలో వివాహము చాలప్రధానమైనది కనుక అప్పటివారి వివాహము లెట్లుండెనో ఈవ్యాసమున నాలోచింతము

హిందూదేశమునకు రాకపూర్వమే ఆర్యులు వివాహవిధిని పవిత్రకార్యముగా భావించుచుండిరని తెలియుచున్నది. అయినను వారిలో నొకకాలమున వివాహపద్ధతి యుండనేలేదను సంగతి మహాభారతమందు కానవచ్చుచున్నది. పూర్వకాలమున స్త్రీలు ఒకపురుషుని వివాహమాడనిర్బంధముండ లేదనియు, వారికి విషయమున సంపూర్ణమగు స్వేచ్ఛయుండెననియు—ఏకబీజోద్భవులమను నభిమానము అభావమగుటవలన భ్రాతృభావము జనులయందు లేకపోవుటచేతను, ముదుసలులగు స్త్రీపురుషులనేమమారయువారు లేకపోవుటచేతను, తదితరకారణములవలనను, వివాహపద్ధతి యవసర మయ్యెననియు-కనుకనే ఒకపతిని ‡ పొం

‡ వ్యుచ్చరంత్యాః పతింనార్యా, అద్యప్రభృతిపాతకమ్। భ్రూణహత్యా

దనిస్త్రీ భ్రూణహత్యా దోషము ననుభవించుననియు ఋషులు విధించిరనియు, పాండురాజు కుంతిని నియోగపద్ధతిని సంతానము బడయ నాజ్ఞాపించు సందర్భమున నున్నది. పైవాక్యమున నుల్లేఖింపఁబడిన "పూర్వకాలము" క్షాత్రయుగమునకంటె యెంతో పురాతనమై యుండవలయును. వీరకావ్యములకు సమకాలీనములగు నుపనిషత్తులలోఁగూడ నొకసందర్భముకలదు. ఆసందర్భమున ఒకడు తనతల్లిని "నాతండ్రియెవరు?" అనియడుగఁగా "నేను యౌవనకాలమున పలువురతో సాంగత్యము చేసితిని కనుక నీతండ్రి ఫలానివాఁడని చెప్పఁజాలను" అనితల్లి ప్రత్యుత్తర మిచ్చెను. ఈకథయు- వివాహవిధి ఇంకను ఉనికి లోనికి రాకయున్న అతిపురాతనకాలపు విషయమై యుండవచ్చును. కుమారునిపేరు తల్లిపేరుతోఁగలిపిచెప్పు నాచారముకూడ అట్టికాలపుదేయైయుండవచ్చునని మాతలంపు.

క్షాత్రయుగారంభమున బహుభార్యాత్వము సామాన్యాచారమైయుండుట మనకు విస్పష్టముగా నగపడుచున్నది. దశరథునకు మూఁడువందల ఏబదిమందిభార్యలును. (దేవేరులు మాత్రము ముగ్వురే), రావణునకు వేయిమంది భార్యలును ఉండిరి. ఇఁక ఈవిషయమున అందఱనుమించినవాడు మన శ్రీకృష్ణుడు. అతనికి పదునాఱువేల భార్యలుండిరని చెప్పుదురు. ఈసం

సమం ఘోరం, భవిష్యత్యసుఖావహమ్ ॥ఆది॥ భార్యవిషయమున నక్రమముచేసిన పురుషునకుఁ గూడ నిట్లే దోషము విధింపఁబడియున్నది కాని వానిని మనవారు పాటింపరు. భార్యాం పథావ్యుచ్చరతః, కౌమారబ్రహ్మచారిణీమ్ । పతివ్రతామేతదేవ, భవితా పాతకం భువి॥ఆది॥



ఖ్య కొంతయతిశయోక్తితోఁగూడినదేయైనను అతనిభార్యలసంఖ్యమాత్రము మితిమీరినదై యుండెననుట నిశ్చయము. పరదేశీయులలో పూర్వకాలమున "హర్క్యూల్సు" అనువాని కనేకమందిభార్యలుండినట్లును "సాలమను," అనునాతనికి వేయిమంది భార్యలుండినట్లును తెలియుచున్నది. ఇవియన్నియు స్త్రీలు సాధారణములగు దోపిడివస్తువులుగా నెంచఁబడుచుండిన కాలపు ముచ్చటలు. ఆకాలమున ఒకదేశపురాజు వేఱొకదేశమును జయించునప్పుడు అచ్చట లభించిన దోపిడివస్తువులనెట్లో యట్లే యచ్చట దొరకిన స్త్రీలనుగూడ తెచ్చి తన మందిరములలో నునిచి తనవిషయాసక్తిని తృప్తిపఱచుకొనుటకు సాధనములుగాఁ జేసికొనుచుండెను. ఆకాలమున మనదేశమునందు బ్రాహ్మణుఁడగువాఁడును క్షత్రియుడును తమవర్ణములకుఁ జెందిన స్త్రీలనేకాక, తమకు క్రింది వర్ణముల స్త్రీలనుగూడ పెండ్లి యాడవచ్చునను నియమముండెను. ఈనియమము భార్యలసంఖ్యను తగ్గించుటకు బదులుగా హెచ్చించుటకే తోడ్పడెను. దేశమునందలి విస్తీర్ణప్రాంతములు నిర్జనములుగానుండి జనసంఖ్య తక్కువగానుండిన దినములలో భార్యలసంఖ్యను తగ్గించుట యవసరముగానైనను కాన్పింపలేదు. ఇఁకజనుల జీవితమాందమూ అదియును ఇప్పటికాల మంతకష్టముగా నుండలేదు. కనుక సంతానము కొఱకు నెట్టి వివాహములనైనను చేసికొనుచుండిరి.

* బహుభార్యాత్వము ఆచారముగానుండిన క్షాత్రయుగాదియందే బహుభర్తృత్వముయొక్క యుదాహరణముకూడ

* దుర్యోధనునకు భీమునకు పలువురు భార్యలుండిరి. స్త్రీపర్వము.

పాండవులయందు కానవచ్చుచున్నది. రెండవమారు మన దేశ
మునకువచ్చి చల్లని ప్రదేశములలో నివసించిన యార్యులవెంట
స్త్రీలు కొద్ది మందిమాత్రమే యుండుటవలన పరువురుపురుషులు
ఒక స్త్రీనే భార్యగాఁ గొనవలసివచ్చెను. మహాభారతమునందు
బహుభర్తృత్వమునకు ద్రౌపదియొకతెయే యుదాహరణముగా
గానవచ్చుచున్నది. అయినను పలువురొకవనితను పెండ్లియాడ
వచ్చునా యను ప్రశ్న వచ్చినసందర్భమున యుధిష్ఠిరుఁడు "ఇది
మా వంశాచారము" అని చెప్పియున్నాడు.. ఈకారణమును
బట్టి చూచినచో ఈయాచారము మొదటవచ్చిన యార్యులలోఁ
గాకపోయినను రెండవమారు వచ్చినవారిలో క్షాత్రయుగారంభ
మున నుండెనని మన మొప్పుకొనవలసియున్నది. ఇదికాకనియోగ
పద్ధతిని సంతానముఁ బడయు నాచారముకూడఆకాలపు టార్యు
లలో నుండినట్లు కానవచ్చుచున్నది. వీనినిబట్టి విచారించిన
యెడలసంతానోత్పత్తి ఆదినములలో నత్యవసరముగానెంచఁబడు
చుండెనని తోఁచుచున్నది.

బహుభార్యాత్వము, బహుభర్తృత్వము, నియోగము
వీనితోఁబాటు వితంతూద్వాహములును సభర్తృకల పునర్వివా
హములును ఆచరణయందుండవచ్చునని మనకుఁదోఁచుట సహ
జము. దమయంతికి ద్వితీయస్వయంవరము జరుగునని ప్రకటింపఁ
బడి యుండెను. కానియిదిజరుగలేదు ఈసందర్భమున నలుఁడు
సాధారణస్త్రీవలె విషయలౌల్యమునకు లోఁబడినదానవని దమ
యంతిని నిందించెను. ద్యూతమున ద్రౌపదియోఁడబడినపిమ్మట,
పాండవులను వదలిదృతరాష్ట్రసుతులలో నొకనిఁజేపట్టుమనిదుర్యో



ధనుఁ డామెనాజ్ఞాపించును. ఇది పరిహాసముగాఁ బలుకఁబడినవాక్య
మేయైయుండవచ్చును. కాని ఉన్నతములగు నీతితత్వములనెరుఁ
గనిస్త్రీలు ఒకభర్తనువదలి వేరొకభర్తనుపొందుటఆకాలమున
అసాధారణ విషయము కాదని దీనివలనఁ దెలియుచున్నది. క్షా
త్రయుగారంభమున వితంతూ ద్వాహము మాట ఎట్లుండినను,
ఆయుగాంతమునమాత్ర మీయాచరము సంపూర్ణముగా నిషే
ధింపఁబడియుండెననుట నిస్సంశయము. ¶ ఆర్యస్త్రీలు పునర్వి
వాహము చేసికొనురనుటకు ప్రమాణములు రామాయణ
భారతములందు లేవు. జర్మనులలోని యొకతెగకు సంబంధించి
వితంతువులు మరల వివాహము చేసికొనరని "టాసిటసు" అను
నతఁడు వ్రాసియున్నాఁడు. దీనిని బట్టి చూచినచో ఆర్యజాతియం
దీనిషేధము అతిపురాతన కాలమునుండియే యుండెనని తోఁచు
చున్నది. ఏలయన ప్రపంచమందలి మఱేజాతియందును ఇట్టి నిషే
ధముండినట్లు ప్రమాణము కానరాదు. "భుక్తపూర్వ"లగు స్త్రీ
లను (అనగా క్షతయోనులను) వివాహము చేసికొనుటకు
ఆర్యులు పాతకముగా నెంచుచుండిరి గనుక ఇట్టినిషేధము ఆర్య
జాతియందు ఏర్పడెనని భావింపఁ దగియున్నది. సైంధవుని మఱు
నాఁటి సాయంత్రమువఱకుఁ దెగటార్చెదనని అర్జునుడు చేసిన
శపథమున ఇట్టివివాహము పాతకముగాఁ దలఁపబడుచుండినట్లు
తెలియుచున్నధి. "భుక్తపూర్వ"లగు స్త్రీలను వివాహమాడిన

---

¶ ఈవిషయమున దీర్ఘతముఁడు విధి నిర్ణయించెను.
ఏకఏవపతిర్నార్యా యావజ్జీవపరాయణమ్ । మృతేజీవతివాతస్మిన్నాప
రంప్రభుయాన్నరమ్॥ ఆది॥

వారు పోయినగతికి నేను పోయెదగాక” యని యాతడనుచు న్నాడు. ‡ తమరక్తము పరిశుభ్రమైనదని గర్వపడు శూరపురుషులలో నిట్టిభావముండుట యబ్బురముకాదు.

తాము వివాహము చేసికొను కన్యలు యుక్తవయస్కలై వివాహమునాడే నిషేకమునకు తగినవారుగా నుండవలయునని ఈ యుగారంభమున నుండిన యార్యులు కోరుచున్నట్లు కానవచ్చుచున్నది. ద్రౌపదీ వివాహము పంచపాండవులలో నొకనితో నొక్కొక్కదినము జరిగెననియు, అట్లయ్యు దేవతాప్రభావమున ప్రతిదినము ఆమె కన్యగానే యుండెననియు మహాభారతమందున్నది. దీనిని బట్టి జూడ వివాహవిధులలో నిషేకకార్యము ముఖ్యముగా నుండెననియు, వధువు నిషేకయోగ్యగా నుండుట యవసరముగా నుండెననియు, తెలియవచ్చుచున్నది. వివాహ కాలమున ద్రౌపది వర్ణింపబడిన విధమునుబట్టి చూడ ఆమె తగినవయస్సు కలదిగ నగపడుచున్నది. కుంతికి వివాహమునకు పూర్వమే పుత్రుడు జన్మించి యుండెను. వివాహమైన కొలది మాసములకే మరణించిన అభిమన్యుని భార్య ఉత్తర గర్భవతిగా నుండెను. అర్జునుడు సుభద్ర నెత్తుకొని పోయినపుడు ఆమె నిండు జవ్వనము కలదై యుండెను. వేయేల? మహాభారతమున వచ్చిన స్త్రీలందరు నిట్టివారుగానే యున్నారు. మహాభారతమును బట్టి చూచిన, క్షాత్ర యుగారంభముననే కాక దానియంతమున గూడ ప్రౌఢావివాహములు వాడుకయందుండినట్లు కానవచ్చుచున్నది. రామాయణము కూడ దీనినే

‡ భుక్తపూర్వాం స్త్రియంయేచ విందతామఘశంసినాం॥ ద్రోణ॥



బలపరుచుచున్నది. కాని కొన్నిచోట్ల దానియందు ఈ విషయమున తరువాతి కాలపు టభిప్రాయములు దూర్పబడినవి. ద్రౌపది స్థితియందువలెనే, సీతారాములు మిథిలనుండి యయోధ్యకు రాగానే నిషేకము జరిగినట్లున్నది. ¶

ఈ యుదాహరణము లన్నియు క్షత్రియ వంశము వారివనియు, రాజపుత్రులలో ఆనాడే కాదు నేటివరకు కూడ పై యాచారమే యున్నదనియు కొందఱు వాదింప వచ్చును. బ్రాహ్మ వివాహము ఆచారముగ గల బ్రాహ్మణజాతిలో పైన జెప్పబడిన వివాహపద్ధతియుండలేదని అట్టివారుచెప్పవచ్చునుకాని అట్టివాదము సరియైనదికాదు. క్షత్రియకన్యయెంత యుక్తవయసురాకపూర్వమే పెండ్లియైన యొక బ్రాహ్మణకన్యకయైనను వీర కావ్యములయందు మనకు కానరాదు. శుక్రుని కూతురగు దేవయాన మొదట కచుని ప్రేమించి యాతనిచే నిరాకరింపబడి యయాతిని వివాహమాడినట్లు మహాభారతమునం దున్నది. పెండ్లి సమయమున నీమె సంపూర్ణ యౌవనవతి. వృద్ధురాలగు వరకు అవివాహితగానేయుండి తపము సల్పుచుండిన బ్రాహ్మణ స్త్రీ యొకతె మనకు శల్యపర్వము నందలి 33 వ అధ్యాయమున కానవచ్చుచున్నది. స్వర్గమునకు బోదలచినచో వివాహమాడవలసి యుండునని ప్రబోధింపబడిన పిదప ఆమె తుదకు

¶ ఈసందర్భమున నీక్రింది శ్లోకము చాలముఖ్యమైనది. ఇది బహుశః రామాయణముయొక్క మూలగ్రంథములోనిదై యుండవచ్చును. అభివాద్యభివాద్యాంశ్చ సర్వారాజసుతాస్తదా । రేమిరేముదితాః సర్వా భర్తృభిః సహితారహః॥ బాల॥

వార్ధక్యమున నొకఋషిని పెండ్లిచేసికొనెను. దండునివలనఁ బలాత్కారముగా చెఱుపఁబడినదగు భృగుమహర్షి కూతురుయుక్త వయసు వచ్చువరకు అవివాహితగానున్న బ్రాహ్మణ స్త్రీయే కదా. ‡ అను శాసనపర్వమునందు స్త్రీకి వివాహము కాఁదగిన వయసు యౌవన ప్రాప్తియే యని స్పష్టముగాఁ జెప్పబడియున్నది. $

వివాహకాలమున పురుషుల వయసు కూడ స్త్రీలవయసున కనుగుణ్యముగానే యుండినట్లు కానవచ్చుచున్నది. బ్రహ్మచర్యము క్రమముగా పాలించబడుచునేయుండిన పక్షమున వేదములు ౧౨, ౨౪, ౩౬ సంవత్సరములకాలమువరకు పఠింపఁబడి కంఠస్థము చేయఁబడుచునే యుండిన పక్షమున పురుషుల వివాహము ౨౦ సంవత్సరములకు ముందు అగుచుండగనే లేదని మనము నిశ్చయింపవచ్చును. చిన్నతనములో స్త్రీ పురుషుల కలయిక కలికాలపు దుర్లక్షణములలో నొకటి యనియు, పూర్వయుగములందు సంపూర్ణ యౌవనము రానివాఁడు స్త్రీ నెఱుఁగఁడనియు చెప్పబడుచున్నది. ¶ ఈప్రకారముగా స్త్రీ

‡ ఆదిపర్వములోని ౧౬౩ వ అధ్యాయమందున్న ఈక్రింది శ్లోకమునందు ఒక బ్రాహ్మణుఁడు బకున కాహారముకాఁబోవుచు విలపించుచున్నాఁడు. దీనినిబట్టి క్షాత్రయుగాంతమునఁగూడ బ్రాహ్మణకన్యలు యుక్తవయసు రాకపూర్వము వివాహితలగుచుండినట్లు కానరాదు. శ్లో॥ బాలామప్రాప్తవయసమజాతవ్యంజనాకృతిమ్ । భర్తురర్థాయనిక్షిప్తం న్యాసంధాత్రా మహాత్మనా॥

$ వయస్థాంతుమహాప్రాజ్ఞ కన్యామావోఢుమర్హసి॥
నచ స్త్రీయం ప్రజానాతి కశ్చిదప్రాప్తయౌవనః॥ అను॥



పురుషులు సంపూర్ణవయసు ప్రాప్తించిన తరువాత వివాహము చేసికొనుచు, ఆరోగ్యవంతులగు బిడ్డలను కనుచు నుండిరి. $

ఆచార మిట్లుండి నపుడు స్త్రీ పురుషుల వలన నొక్కొకప్పుడు అక్రమణము జరుగుచుండుట సహజము. వివాహమునకుఁ బూర్వమే కుంతి కుమారునిగనుట ఇందునకు తార్కాణము. మహాభారతములోని యొక శ్లోకమును † బట్టి, యౌవనవతులయ్యు అవివాహితలుగా నుండిన కన్యల మానసికావస్థ పాశ్చాత్య స్త్రీ పురుషుల యవస్థవలెనే యుండెనని తోఁచుచున్నది. యుక్తవయస్కులగు స్త్రీల వర్తనము మతము వలనను, ధర్మశాస్త్రము వలనను కాపాడఁబడుచుండెడిది. సమ్మతితోనే యైననేమి, ఒక కన్యను చెఱచుట మనుస్మృతిప్రకారము గొప్పదోషము. ఇట్టి దుష్కార్యమునకు పాల్పడిన కన్నె బ్రహ్మహత్యాదోషమున మూడవ భాగమును, చెఱచిన పురుషుఁడు తక్కినపాపమునుపొందుననిమహాభారతము శాసించుచున్నది. ‡

పై కారణమును బట్టి, క్షాత్రయుగమునాఁటి హింద్వార్యులలో వివాహములు, కన్యల కన్యాత్వమును పురుషుల బ్రహ్మచర్యమును కాపాడుటకు అవసరములగు నియమములతో

$ "టాసిటసు" ఇట్లే వచించి యున్నాఁడు.

† ప్రధానకాంక్షిణీనాంచ కన్యానాంవయసిస్థితే । కృత్వా కథాస్తథాయుక్తాః సాకాకృశతరీమయా॥ శాం ॥

‡ త్రిభాగం బ్రహ్మహత్యాయాః కన్యాప్రాప్నోతిదుష్యతి । యస్తుదూషయితాతస్యాః శేషంప్రాప్నోతిపాప్మనః॥ అను ॥ కృతము.

జరుపఁబడు చుండెనని తెలియుచున్నది. బాల బాలికలకు పసి తనముననే వివాహము జరగుచుండిన ఈ కాలపు సంఘస్థితికిని ఆ కాలపు సంఘస్థితికిని చాలభేదము కన్పట్టుచున్నది. బాల్య వివాహములు బౌద్ధయుగమున మన సంఘమునఁ బ్రవేశించి క్రమక్రమముగా పెఱిగి తద్యుగాంతము వఱకు— ముఖ్యముగా క్రీ.శ. ౬౦౦ నుండి ౧౦౦౦ వఱకు స్థిరపడినవి. అనగాఁ బాల్య వివాహములు క్షాత్రయుగాంతము నాఁటికి మెల్లఁగా నారంభమైనవి. వీరకావ్యములలో మనకీ విషయమున ప్రమాణములు దొరకవుగాని ఆకాలమందు హిందూదేశమునకు వచ్చిన గ్రీకుల చరిత్రకారుల వ్రాతలలో పైయూహకాధారముకలదు. ఏఁడు సంవత్సరముల బాలికలను పెండ్లియాడి వారితోఁ గలసియున్న పురుషులు దక్షిణమున నుండెనట్లును, వారుదీర్ఘాయువులు కాక ౪౦ సంవత్సరములకు ముందే చనిపోవు చుండెనట్లును గ్రీకులు వ్రాసియున్నారు. ఈ చరిత్రకారులు తాము వినిన యంశముల నెల్లను నమ్మచు అతిశయోక్తులు వ్రాయుచుండినట్లు తోఁచుచున్నది. ఒంటికాలి మనుష్యులును, చెవులతో శరీరమునంతను కప్పికొనువారును ఈ దేశమునం దున్నారని వారు వ్రాసిన వ్రాతలెట్టివో పై యంశమునఁగూడ వారి వ్రాఁత యట్టిదిగా మనము నిర్ధారణ చేసికొనవచ్చును. కాని రెండు సంగతులు మాత్రము వారి వ్రాఁతనుబట్టి మన మూహింపవచ్చును; (౧) బాలికల అతిబాల్య వివాహములును నిషేకములును ఆకాలమున అస్వాభావికముగాను, అసాధారణములుగాను తలఁపఁబడు చుండెను.



(౨) అతిబాల్యవివాహములు దక్షిణము నందలి అనార్యులగు ద్రావిడజాతులలో జరుగుచుండెను.

మనుస్మృతి కర్తలు వివాహములను ఎనిమిది విధములుగా భాగించియున్నారు. వీనిలోని మొదటి నాలుగు, బ్రహ్మ, దైవ, ఆర్ష, ప్రజాపతి పద్ధతులు. ఈనాల్గు పద్ధతులును వివాహ పద్ధతియొక్క నాల్గు వివిధావస్థలను సూచించుచున్నవి. దేవతలు ఆర్యులకు అతిపూర్వికులు; ప్రజాపతులు వారి తరువాత వారు; ఋషులు వారికి సమీపస్థులగు పూర్వికులు. దైవ, ప్రజాపతి, ఆర్ష పద్ధతులు పైమూఁడిటికిని క్రమముగా సంబంధించి యున్నవి. ఇఁక బ్రాహ్మవివాహము. ఇది గంగానదీ ప్రాంత వాసులగు బ్రాహ్మణార్యులలో నాచారముగానేర్పడిన అత్యుత్తమ వివాహ పద్ధతి. ఈపద్ధతియందు కన్యవరునకు అనేక దక్షిణలతోఁగూడ దానము చేయబడుచుండెడిది. తక్కుంగల మూఁడు పద్ధతులు, వివాహము విక్రయ పద్ధతినుండి దానపద్ధతి వచ్చువఱకు కలిగిన దశాభేదములు. మొట్టమొదట ఆర్యులు తమ కూఁతుండ్లను పశ్వాదులవలెనే అమ్మఁదగిన వస్తువులుగాఁ దలఁచుచుండిరి. ఈ యభిప్రాయము అసురులనఁబడు పురాతన ఇరానియనుల యందు (పారసీకార్యులయందు) విశేష వ్యాప్తి కలిగి యుండినందున దానికి అసుర వివాహమని పేరువచ్చెను. గ్రీకులు మన దేశమందుండిన కాలములో నీ యాచారము పంజాబు దేశమందలి కొన్ని తెగలలో నుండెను. వీరీ యాచారమును సింధునది యావలి గట్టునుండి వచ్చిన కాలమున తమ వెంటఁదెచ్చికొని ఇంకను మఱువక యట్లే యుంచుకొని యుందురు. మాద్రియు,

కై కేయియు, గొప్పగొప్ప బహుమానములకు ప్రత్యామ్నా
యము వరుసగా పాండురాజునకును, దశరథునకును లభించి యుం
డుట మన మెఱుఁగుదుము. మాద్రేయులు, కేకయులు పంజా
బునందు వసించుచుండిన పూర్వోక్తములగు తెగలవారు. అలె
గ్జాండరుతోఁగూడ మన దేశమునకు వచ్చిన వారు సయితము
"తక్షశిల''లో నిట్టి యాచారమునే కనుగొని యుండిరి. "తక్ష
శిలయందు యౌవనురాండ్రగు కన్నెలు విక్రయమునకై యుం
చఁబడుచుండిరి. కొనువారు ముందునకు వచ్చినపుడు వారి భుజ
ముల మీఁది బట్టతీసి చూపుచుండిరి. అందఱికన్న నెక్కువ
ధన మిచ్చిన వానికి కన్నె విక్రయింపబడు చుండెను.'' అని 'ఏరి
యను' వ్రాసియున్నాఁడు. స్మృతి వాక్యానుసారము ఈపద్ధతి
చాల హీనమైనది ; ఇట్టి వివాహములు అరుదుగా కొన్ని స్థల
ములలో మాత్రమే కానవచ్చుచుండెడివి. అలెగ్జాండరు కాల
మున మన దేశమునందు "కాథయులు''ను "సాపైతియులు''ను
భిన్నములగు వివాహాచారములను కలిగియుండిరఁట. వీరు వీర
యుగమునాఁటి "కేకయులు''ను "మాద్రేయులు''ను నై యుం
డవచ్చును. ఈ రెండు తెగలలో "కాథయ'' స్త్రీలుతమ భర్త
లను తామే నిర్దేశించుకొను చుండిరి. "సాపైతి'' స్త్రీలు వెలల
కమ్మఁబడు చుండిరఁట. వీరిలో వరదక్షిణయను మాటయే
యుండ లేదఁట. *

ఇఁక స్వయంవర పద్ధతిని గూర్చి విచారింతము. ఇది
రెండు విధములుగా నుండెను. వధువు తన యిష్టమువచ్చిన

* "అలెగ్జాండరుని హిందూదేశపు దండయాత్ర'' మాక్ క్రిండిల్



వరుని వివాహము చేసికొనుట మొదటిది; వరుఁడు తన బాహు
బలమును ఏదైన పోటీయందు ప్రదర్శించి వధువును వివాహ
మాడుట రెండవది. వీనిలో మొదటి పద్ధతి "గంధర్వ''లను
అనార్యజాతివారి యనుకరణమున ఆర్యులలో ప్రవేశించి యుం
డును. మహాభారతమందలి గాంధర్వ వివాహములలో ఆదర్శ
మనఁదగినది శకుంతలా వివాహము. రెండవ పద్ధతి ఆర్యక్షత్రి
యులకు మిగుల ప్రియమైనదిగానుండెను. రాచ కన్నెలఁ బెండ్లి
యాడు కుతూహలమున పలుమారు బ్రాహ్మణులుకూడ నిట్టి
పందెములందు తమ బాహుబల ప్రదర్శనము చేయుచుండిరి.
బలమును చూపుటకు సాధనము ఆకాలమున ధనుర్విద్యయే.
ద్రౌపదీ పాణిగ్రహణార్హత అట్టి విద్యనుబట్టియే నిర్ణయింప
బడెను. పై యాచారము క్షాత్రయుగాంతమునఁ గూడ నుండి
నట్లు గ్రీకు చరిత్రకారులు వ్రాసియున్నారు. *

రాక్షస వివాహముకూడ తఱచుగా క్షత్రియులలోనే
జరుగుచు బాహుబలోత్తేజమునకుఁ సహకారిగానుండెను. ఈ
వివాహమునందు క్షత్రియుని కూతురును ఆమె కిష్టముగ నుండి
నను సరే లేకపోయినను సరే పురుషుడు బలాత్కారముగా
లాగికొని పోవును. వధువు బంధువు లాతని నెదిరింతురు, వరుఁ
డే వారి నోడించినచో వధువు అతని భార్యయగు చుండెడిది.
సుభద్ర వివాహమిట్టిదే. మహాభారతమును బట్టి చూచినచో
ఆమె మనఃపూర్వకముగా నర్జును వెంటఁ బోయినట్లు కాన
రాదు. సుభద్రబంధువులగు వృష్ణులు అర్జును నెదిరింప దలఁచిరి;

* "మెగాస్థనీసు మఱియు ఏరియను'' మాక్ క్రిండిల్ కృతము.

కాని కృష్ణుఁడు వారి యావేశము నడఁచి, అట్టి ప్రయత్నము వ్యర్థమని బోధించి వారిని వారించెను. సీతాహరణముకూడ నిట్టిదానిలోదే కాని యామె అంతకు ముందే వివాహితయై యుండెను. ఆలోచించి చూచిన పక్షమున వధూహరణము వివాహితల విషయమునఁ గూడ జరగుచుండెనని తోఁచు చున్నది. వివాహితలను లాగికొనిపోవు నాచారము రాక్షసులలో నిదై యుండవచ్చును. "అభుక్త" స్త్రీలను వివాహమాడుట ముఖ్యోద్దేశముగాఁగల ఆర్యు కిట్టి యాచారముకలిగి యుండుట మనకు విరుద్ధముగానే కానవచ్చును. పాండవు లరణ్యవాసము చేయుచుండినకాలమున నొకనాఁడు ద్రౌపదిని జయద్రథుడుఎత్తుకొని పోయినకథపై యట్టివివాహమునకు మఱియొక యుదాహరణము. ఈసందర్భమున ధౌమ్యుఁడు పలికిన వచనము ఆకాలపు మర్యాద పైనకొంత కాంతిని ప్రసరింపఁజేయుచున్నది. "మహారథులగు నాపెభర్తలజయించికాని నీవామెను తీసుకొని పోఁజాలవు; జయద్రథా! పురాతనమగు క్షత్రియ ధర్మమును పాలింపుము" అని ధౌమ్యుడనెను ‡ దీనిని బట్టిచూడగా వివాహితలనుగూడ, వారి భర్తల నోడించి ఎత్తికొని పోవుట క్షత్రియ ధర్మముగా నుండినట్టు కానవచ్చుచున్నది.

పైశాచవివాహాచారము మనుష్యమాంసముఁ దినుచుండిన పిశాచులను అనార్యజాతియందుండెనని మనమూహింప వచ్చును. ఈజాతివారియందు వివాహపద్ధతిలేక పోవుటయేకాక

‡ నేయంశక్యాత్వయానేతు మవిజిత్యమహారథాన్। ధర్మంక్షత్రస్య పౌరాణ మవేక్షస్వజయద్రథ॥ వన ॥



బలాత్కారముగాఁగాని ప్రచ్ఛన్నముగాఁగాని సంభోగించుట యభ్యాసమై యుండెను. ఈప్రకారముగా సంభోగింపబడినస్త్రీ అట్టిపురుషుని భార్య కావలసి వచ్చుచుండెను. స్త్రీల పాతివ్రత్యమును కాపాడుటకై, ఈపద్ధతిని ఆర్యులుకూడ అరుదుగా అవలంబించియుండిన నుండవచ్చును.

పైనఁజెప్పియున్న వివాహములు ఆకాలమున ఆర్యులలోని వివిధజాతులయందును అనార్యులలోను పరస్పరానుకరణము వలన సహవాసకారణముచేత జరుగుచుండెననుట నిస్సంశయము. ఇట్టి సహవాసమువలన నుద్భవించిన యనేక నిర్బంధవిధులు మనకు కానవచ్చుచునేయున్నవి. అగ్రజాతులవారు క్రిందిజాతుల వారి కూతుండ్లను పెండ్లియాడవచ్చును కాని క్రిందిజాతులవారు పైజాతులస్త్రీలను పెండ్లిచేసికొనఁగూడదు. ఈనియమమునకు విరుద్ధముగా జరిగిన వివాహమువలన జనించినసంతానము తుచ్ఛమైనదిగా తలఁపఁబడుచుండెను. తాము శూద్రస్త్రీలను వివాహమాడఁగూడదని బ్రాహ్మణులు విధించికొనిరి. కాని మహాభారతమున పలుతావుల శూద్రస్త్రీని పెండ్లియాడిన బ్రాహ్మణులు నిందింపఁబడి యున్నారు. వీరికి "వృషలీపతు"లని పేరు. ఇట్టిపురుషుఁడు దోషియనియు బ్రాహ్మణత్వమునకు దూరగుఁడనియు నరకగామియనియు చెప్పఁబడి యున్నాఁడు. కాని వీనిసంతతి కెట్టిన్యూనతయు చెప్పఁబడియుండలేదు. జయద్రథుని జంపుదునని అర్జునుఁడుచేసిన శపథమున, తానట్లు చేయనిచో "వృషలీపతిపొందుదుర్గతిని పొందెదనని" ఆతనివచనము కలదు.

వెనుక మేము చెప్పినప్రకారము త్రేతాయుగారంభము

నాటికి ఆర్యులు వివాహపద్ధతిని ఏర్పరచుకొనియే యుండిరి. కాని అదియింకను వారిచుట్టునున్న అనార్యజాతులలో కేవలము ఆరంభదశయందేయుండెను. ఉదాహరణార్థము ఉత్తరకురుదేశస్థులు ¶ పాండవుల కాలమున ఇంకను వివాహము చేసికొనుచుండనేలేదు. ఈయంశమునుబట్టియేకాఁబోలును "హిరోడోటసు" అను గ్రీకుచరిత్రకారుఁడు "హిందువులు పశువులవలె బహిరంగముగా సంభోగించెదరు" అని అతిశయోక్తితో వ్రాసినాఁడు బహుభార్యాత్వబహుభర్తృత్వ నియోగములు ఆర్యులందుండెను బ్రాహ్మణులందు వివాహములు క్రయవిక్రయదశనుండి కన్యాదానదశకు వచ్చుచుండెను. క్షత్రియులలో స్వయంవరపద్ధతి హెచ్చుచుండెను. నల్లనివర్ణముగల యాదిమ నివాసులతో సంపర్కము కలిగినందున ఆర్యులలో స్వీయజాత్యభిమానము మెండై ప్రతిలోమ వివాహనిషేధమువంటి నియమము లేర్పడసాగెను. "అభుక్త" స్త్రీలుమాత్రమే వివాహయోగ్యలుగా నెంచఁబడుచుండిరి. వితంతువులు అల్పజాతులతో పునర్వివాహముచేసికొనుచుండిరి. బాలవివాహములు బొత్తిగానే లేవు. వెనుకఁ జెప్పబడిన ఆచారముల వివాహపద్ధతులు క్షాత్రయుగము నం

¶ అనావృతాః కిలపురా స్త్రియఆసన్ వరాననే । కామచారావిహారిణ్యః స్వతంత్రాశ్చారుహాసిని ॥
ప్రమాణదృష్టోధర్మోయం పూజ్యతేచమహర్షిభిః । ఉత్తరేషు చరంభోరు కురుష్వద్యాపిపూజ్యతే ॥ అది ॥
ఉత్తరకురుదేశస్థులు టిబెటీయులేయైనపక్షమున ఈవచనము ఇప్పుడును వారికి వర్తించుచున్నది.



దంతట నుండెననుమాట నిజమేయైనను-బ్రాహ్మణవివాహములు ఏకపత్నీవ్రతము, వితంతూద్వాహనిషేధము మొదలగునవి జనులహృదయము నాకర్షించుచుండెను. క్షాత్రయుగాంతమున ద్దులజతకు కన్యను విక్రయించుటయు, పోటియందు చూపఁబడిన బాహుబలము ననుసరించి కన్యనిచ్చుటయు వర్ణాంతర వివాహనిషేధమును వాడుకయందుండెను.

క్షాత్రయుగమునందు భార్యలదశ యెట్టిగానుండెనో విచారింతము యీయుగము తుదయందున్న దానికంటె ఆరంభమున భార్య లెక్కువ స్వాతంత్రశీలురాండ్రుగను ఎక్కువ గౌరవనీయురాండ్రుగను ఉండుటసహజము. వివాహసమయమున యౌవనవంతులైయుండు కాలమునను కానుకలకు ప్రత్యామ్నాయముగా నివ్వఁబడుచుండుకాలమునను, స్వయంవరణమాచారముగా నుండుకాలమునను తమ భర్తలనువదలి మరల వివాహముచేసికొను నధికారముండిన కాలమునను-వారు సదక్షిణముగ కన్యాదానముచేయఁబడు చుండినట్టి భర్తతప్ప వేఱుదిక్కులేక యుండినట్టి కాలమునకంటె నెక్కువస్వతంత్రము ననుభవించిరనుట స్వతస్సిద్ధము. ద్రౌపది తానుస్వయముగా ననుభవించిన స్వాతంత్ర్యమునకును, పతివ్రతయగు స్త్రీ యిట్టిదిగా నుండవలయునని ఆమె వనపర్వమున నిరూపించినవర్ణనమునకును ఎంతోవ్యత్యాసమున్నది. (వనపర్వములోని వర్ణనము ప్రక్షిప్తమనుటస్పష్టము.) ఈవర్ణనము క్షాత్రయుగాంతమున భార్యయగుదాని కుండవలసిన లక్షణములను జూపుచున్నది. ఈయాదర్శమే

నేటికిని మఱింత వికృతాకారముతో మన యిండ్లయందున్నదని వేఱుగఁ జెప్పవలయునా?

వ్యాసుని ద్రౌపది ఎట్టిదో చూడుఁడు:—వివాహకాలమున ఆమెయౌవనవతి శరీరదార్ఢ్యము మనోబలముకలది. ఆమె పాణిగ్రహణముచేయుటకై కాంపిల్య నగరమునందు సమావేశులైయున్న రాజన్యుల సభయెదుటికి నిర్భయముగా వచ్చెను. కర్ణుఁడు మత్స్యయంత్రమునుదెగ వేయదలఁచి ముందడుగిడ ఆవంత ధైర్యముచెడక కొద్దిజాతివానిని నేను పెండ్లియాడనని నిర్భయముగా వచించెను. బ్రాహ్మణవేషముననున్న వాఁడొకఁడు తన ధనుర్విద్యాకౌశలమునుచూపి గెలుపొంద ఆమె సంతోషపూర్వకముగా బీదయింటికి పోయెను. తానెదుటలేని సమయమున తన్నుద్యూతమున నోడినపుడును, దాసిగా ద్యూతగృహమునకు దీసికొనిరాఁబడినపుడును ఆమెతాలిమిఁ గోలుపోలేదు. తనవిపన్నావస్థ కించుకేనియు తత్తరముచెందక ధర్మశాస్త్రానుసారము తన్నోడుట క్రమమా యక్రమమా యను విషయమున నామె చేసినప్రశ్న ఆమెశాస్త్రజ్ఞానమును ప్రకటించుచున్నది. పలువురు ఆమె "పండిత" యనియు "బ్రహ్మవాదిని" యనియు మహాభారతమున పిలువఁబడియున్నది. వనవాసకాలమునందామె భర్తలతో రాజ్యాంగవిషయములందు తర్కవితర్కముల సల్పెను. వారి కాలోచన చెప్పెను. విరటుని యంతఃపురమున సైరంధ్రిగా నుండినకాలమున ఎంతోధైర్యముతో వర్తించి అజ్ఞాతవాస నియమమును జయప్రదముగాఁ గడపెను.

ఇఁక క్షాత్రయుగాంతమున ద్రౌపదినోటనేచెప్పింపఁబడిన



ఉత్తమురాలగు భార్యలక్షణములను గమనింపుఁడు. వనపర్వము లోని ౨౩౩ వ అధ్యాయమున ఆమె సత్యభామతో తాను భర్తల సంతోషపెట్టుచుండిన విధమును ఇట్లుచెప్పుచున్నది. "గర్వమును కోపమును వదలుకొని నేను సదాభర్తలకును వారి భార్యలకును సేవచేయుచుందును. తప్పుమాట మాట్లాడుటకును తప్పుగానిలఁబడుటకును తప్పుగా చూచుటకును అమర్యాదగా గూర్చుండుటకును చెడ్డస్థలములకుఁ బోవుటకును నాభర్తల యుద్దేశముల నూహించుటకును భయపడుచుందును. నేను పరపురుషుని కన్నెత్తిచూడను. అతఁడు దేవుడైననుసరే, యౌవనుడైనను సరే, ధనికుండైననుసరే, సద్వర్తనుఁడైననుసరే, భర్త భుజింపనిది నేను భుజింపను. ఆయన నిద్రింపనిది నేను నిద్రింపను. భర్త పొలమునుండిగాని, యడవినుండిగాని, గ్రామమునుండికాని తిరిగివచ్చునప్పుడు * నేను నిలఁబడి నీరొసగి పీఠము వేసెదను. పాత్రలునున్నగాదోమి అన్నముచక్కగావండి, వేళకు భర్తకమర్చెదను. ఆహారపదార్థములను బాగుగాఁ గాపాడెదను. ఇంటిని శుభ్రముగానూడ్చెదను. చెడ్డస్త్రీల సహవాసముచేయను. సోమరితనమునుమాని సర్వదాభర్తలను సంతోషపెట్ట యత్నించుచుందును. ఎకసక్కెమాడను. నవ్వను. గృహద్వారమున నిలువఁబడను. బహిరంగప్రదేశములకు తఱుచుగాఁబోను. ఇంటి యావరణములో చాలసేపు నిలువను. కుటుంబపోషణముకొరకు భర్తదేశాంతరముపోయినపుడు అలంకారముచేసికొనను. భర్త

* ఇచట ద్రౌపది రాజపత్నిగా మాటాడుటలేదు. చదువరు లాలోచింతురు గాక.

తినని వస్తువులు నేనుతినను. ఆయనత్రాగని పదార్థమును నేను త్రాగను. వంశాచారములను జాగ్రతతో నడుపుదును. కోపావేశముననున్న సర్పములకువలె భర్తలకు భయపడి వారిసేవచేసెదను. పసులకాపరులు మొదలుకొని అందఱుసేవకులు చేయుపనులనునేను విచారించుచుందును. నేనుమాయత్తను సంతోషపెట్టుచు ఆమెకు అన్నపానముల నమర్చుచుందును. వేషమునందు నేనామెను మించను. బ్రాహ్మణులకును అతిథులకును జాగరూకతతో సేవచేసెదను. స్వసుఖమును పరిత్యజించి రాత్రిందివములు కష్టపడి కర్తవ్యములనెరవేర్చుచుందును. భర్తలకంటె ముందునిద్రలేచి వారు నిద్రించినతరువాత నిద్రింతును. భర్తలు నన్నుప్రేమించుటకై నేను చేయుచున్న మంత్రప్రయోగమిదియే"

కుటుంబ విషయమునను భర్తవిషయమునను భార్య యెట్లునడచుకొనవలయునో చూపుటకు ఈవర్ణనబాగుగనేయున్నది. కాని ఇదితగినంతయున్నతముగాలేదు. సుఖదుఃఖములందు భర్తకు సమభాగినియై, ఉన్నతదశయందును దరిద్రదశయందును అతనికి సహాయముచేయు ఆదర్శభార్యకు తగినట్లులేదు. అయినను ఈయాదర్శము హిందూస్త్రీని సుఖముకలదానినిగాను కుటుంబమున కుపకారినిగాను చేయుటకును, ప్రాప్తించిన దానితోనే సంతృప్తగాఁ జేయుటకును చాలియున్నది. హిందూస్త్రీలపాతివ్రత్యము సుప్రసిద్ధము. సీత, సావిత్రి, దమయంతి, ద్రౌపది వీరి యుదాహరణములు హిందూవనితలకు సద్వర్తనమును సర్వదాబోధించుచున్నవి.

గ్రీకుచరిత్రకారులు మన స్త్రీల పాతివ్రత్యమును పొగడ



లేదు. హిందూయువతులు తమప్రేమను ఎవనికైననుసరే ఏనుఁగువెలకమ్ముచుందురని వారు వ్రాసియున్నారు. * కొందఱు చాకిరి చేయించుకొనుటకును, మఱికొందరు స్వసౌఖ్యముకొఱకును, గృహములను పిల్లలతో నింపుటకొఱకును హిందువులు పలువురు స్త్రీలను పెండ్లియాడెదరని వారభిప్రాయ పడినారు. "కనుక బలవంతముగా నిర్బంధమున నుంచిననేకాని వారు వ్యభిచరింతురు.,, అని వారువ్రాసియున్నారు. ౨ నిర్బంధమున నుంచఁబడినస్త్రీలు దుర్వర్తనమునకు పాల్పడియుండుట క్షాత్రయుగమున సంభవించి యుండవచ్చును. వేలసంఖ్యగల కృష్ణుని భార్యలను అర్జునుఁడు వెంటఁగొనిపోవునపుడు వారిలోకొందఱిని కిరాతులెత్తుకొని పోవుటయు కొందఱు తమఇష్టానుసారమే వారివెంటఁబోవుటయు మనకు మహాభారతమునఁ గానవచ్చుచున్నది. కనుక ఇట్టియుదాహరణముల నెచ్చటనోచూచి గ్రీకులు పైవిధమున వ్రాసియుందురేమో గ్రీకులు పంజాబుదాటి రాలేదు. కనుక వారు స్వయముగా నెఱిఁగినదా దేశముమాత్రమే. కనుక పంజాబుదేశపు చిత్తస్థయిర్యమును స్వాంతంత్రశీలమును కల స్త్రీలనుజూచి గ్రీకులు హిందూదేశపుస్త్రీల పాతివ్రత్యము విషయమున దురభిప్రాయపడి యుండవచ్చును. ఆకాలమున హిందూస్త్రీలస్థితికిని పంజాబులోని స్త్రీలస్థితికిని చాలభేదముండెను. అంతేకాక స్వాతంత్ర్యము ననుభవించు స్త్రీలనీతివర్తనమును గుఱించి జనులకు తప్పుడభిప్రాయము జనించుట మనదినములలోఁ

* "మెగస్థనీసు మఱియు ఏరియను" మాక్క్రిండల్ కృతము.

౨ " " "

గూడ కానవచ్చుచున్నది. అట్లే గ్రీకులు మన స్త్రీలవిషయమున నపోహపడియుందురు.

గ్రీకుల కాలములో సహగమన ముండినట్లు వారి వారి వ్రాతలవలనఁ గానవచ్చుచున్నది. "కాథియను" స్త్రీలుతమ మృతభర్తల చితిపైనెక్కి కాలి చచ్చెదరని వారు వ్రాసియున్నారు. ఇంతటిస్వార్థత్యాగముతోను మన స్త్రీలు తమయుసురులఁ బాయుటకు కారణము కనుఁగొనఁజాలక వారు "భార్యలుతమ భర్తలకు విషప్రయోగము చేయకుండుటకై హిందువులు ఈయాచారమును సంఘమున ప్రవేశపెట్టిరి." అని వ్రాసిరి. * మన స్త్రీల వర్తనమునుగుఱించి దురభిప్రాయపడినవారగుటచే వారిట్టియూహనుపన్నిరి. "మాక్ క్రిండల్" అనునతఁడుసహగమనమునుగూర్చి యొకచోట "డయడోరసు" అనునాతనిఈక్రింది వచనము నుల్లేఖించి యున్నాడు. "యూమెనసు అంటిగోనుసు అనుప్రదేశములకునడుమనుండు గాబీసునందుజరిగినసమరములో నిహతుఁడైన "కెతియసు" అనువానిభార్య లిరువురును భర్తతో సహగమనముచేయుగౌరవము తనకబ్బవలెను తనకబ్బవలెను అనివివాదపడిరి. వారిలోపెద్దది గర్భవతిగానుండుటచేత ధర్మశాస్త్రములు ఆమె మరణము నంగీకరింపలేవు. "హిందూస్త్రీలు తమభర్తలవెంట తాము మనఃపూర్తిగా మరణింతురు" అనిఅరిస్టాబ్యులసు మున్నగు చరిత్రకారులు వచించిరని "స్ట్రాబో" వ్రాసియున్నాఁడు. కనుక ఈయాచారము అలెగ్జాండరుని దండయాత్రకు చాలకాలము ముందునుండియే మన దేశమున నుండ

* "అలెగ్జాండరుని హిందూదేశపు దండయాత్ర" మాక్ క్రిండిల్ కృతము



వచ్చును. ఏలయన ఎంతోకాలమునుండియుండిననేకాని పైదండయాత్రనాఁటికి ఇది ఆచారముగాను పుణ్యకార్యముగాను స్థిరపడి యుండదు. అయినను క్షాత్రయుగారంభమున నీయాచారముండెనో లేదో స్పష్టముగా కానరాదు. మాద్రి సహగమనముచేసెనని మహాభారతములో నున్నది. కాని పైనవచ్చిన "కాథియసు" లే మాద్రీయులని వెనుక చూచియున్నాము. కనుక వారియందుండినయాచారము హిందూదేశమునందంతట నుండెనని చెప్పఁజాలము. కృష్ణునిభార్యలలో కొందఱు సహగమనము చేసినట్లు భారతమున నున్నది. కాని ఇదిప్రక్షిప్తమేమో యని సందియమగుచున్నది. ఏలయన, దుర్యోధనునిభార్య లెందఱో ఉండినట్లున్నది కాని వారిలోనొకతెయైనను సహగమనము చేసినట్లులేదు. అంతమాత్రమున క్షాత్రయుగారంభమున నీయాచారము లేదని రాయిఁగుద్ది చెప్పఁజాలము. అయినను, ఈయుగాంతమున మాత్రము పైయాచారము సంపూర్ణదశనందియుండెనని గ్రీకులవ్రాతలు చెప్పుచునే యున్నవి. కనుక సహగమనాచారము సిథియనుల దండయాత్రలతోఁబాటు క్రీ. పూ. రెండవశతాబ్దమున మన దేశమున ప్రవేశించినదను దత్తుగారి సిద్ధాంతము నిలువఁజాలదు.

# క్షాత్రయుగమునాటి హింద్వార్యులు,

# వారి సాధారణ రాజ్యాంగ స్థితి



అయోమార్గమొకటి ఒకస్థలమునుండి వెడలి కొంతదూరమువఱకు ఒకవిధముగా సాగిపోయి, అచ్చటనుండి రెండుశాఖలుగాఁజీలి రెండుభిన్నదిశలకుఁ బోయి పోయి అటనాగిపోవుటయు, శాఖ లాగిపోయిన భిన్న అంతిమస్థానము (terminus) లకు నడుమ ఎన్నియో మైళ్ళయెడమేర్పడుటయు మనము చూచుచున్నాము. హింద్వార్యుల నాగరికతయు, గ్రీకార్యుల నాగరికతయు, ఈ యయోమార్గపుగతిని పోలియున్నవి. ఈ రెండు నాగరికతలును ఆరంభమున నొకస్థలముననే యుద్భవించెను; ఒకవిధముగానే వృద్ధిచెందెను. తరువాత నవి భిన్నమార్గముల ననుసరించి పోయిపోయి, తుదకు రెంటికిని ఏమాత్రమును సామ్యములేని యవస్థకువచ్చినవి. ఇట్లీయంతరము పై రెండు తెగలవారి యాహారవస్త్రాదులలో వాటిల్లినట్లే, క్షాత్రయుగాంతమునాఁటికి వారి సాధారణ రాజ్యాంగ దశయందును సంభవించి యుండుట మనమీవ్యాసమునఁ జూడఁగలము.

క్షాత్రయుగారంభమున హింద్వార్యుల రాజ్యాంగస్థితి ఎట్లుండెనని మనము కొంత సూక్ష్మదృష్టితోఁ బరికించితిమేని



వారి స్థితియు, గ్రీకార్యులస్థితియు ఒకటిగానే మనకుఁ గానవచ్చును. గ్రీసుదేశములోవలెనే మన దేశమునందును చిన్న చిన్న పట్టణ రాజ్యములు (City States) ఏర్పడియుండెను. వీనిలో నొక్కొక్క రాజ్యమొక్కొక్క తెగవారి పాలనమునకు లోనైయుండెను. ఇట్టి ప్రతిరాజ్యము ఆ తెగవారిలో ప్రముఖుఁడుగానుండిన ఎవ్వరైన రాజుపేరుననో, ఆరాజ్యమునందలి ముఖ్యపట్టణము పేరుననో పిలువఁబడుచుండెడిది. ఇప్పటికాలపు పెద్దరాజ్యములను చూచుచున్న మనకు గ్రీసువంటి చిన్నదేశమున నన్ని స్వతంత్రములగు పట్టణ రాజ్యము లెట్లుండెనోకదాయని యబ్బురము తోఁచును. మనదేశము గ్రీసుకంటె వైశాల్యమున నెన్నియోరెట్లు పెద్దది కనుక ఆకాలమున మనదేశమునందుండిన పట్టణ రాజ్యములు గ్రీసుదేశపు వానికంటె విశాలతరములుగానే యుండవచ్చును. అయినను, అంతమాత్రమున నవి ఇప్పటికాలపు రాష్ట్రములతోఁ దూగఁదగినవని తలఁపఁగూడదు. గ్రీసుదేశములోవలెనే మనదేశమున నివసించుచుండిన వేర్వేరుతెగలు ఒకవిధమైన దేవతలనే యారాధించుచు ఒకభాషయొక్క భిన్న శాఖలనే మాట్లాడుచుండిరి. ఆచారవ్యవహారములందును, మతవిశ్వాసములందును వారియందు విశేషభేదముండలేదు. వారిలో పరస్పరవివాహములు జరుగుచుండెను. ఇట్లుండియు రాజ్యాంగ విషయములందు మాత్రము వారు స్వతంత్రులై ఒండొరుల జయింప నిచ్ఛగలవారై యుండిరి. కనుక వారు సర్వదా యుద్ధములు చేయుచుండిరి. అయినను వారు పరరాజ్యముల స్వాతంత్ర్యమును మాత్రము గౌరవించుచునేయుండిరి. మనదేశ

మున నీపద్ధతి క్షాత్రయుగారంభమునకు పూర్వమే మొదలై దాదాపు తద్యుగాంతమువఱకు నట్లేయుండెను. ఆరంభమున వచ్చిన యార్యులతెగలు పశ్చిమోత్తర ద్వారముల ఈదేశముఁ బ్రవేశించి ఇచ్చటి సుఖప్రద ప్రాంతములలో పంజాబునుండి కోసల, విదేహ దేశములవఱకు హిమాలయ పరిసరములలో నివసించిరి. ఇఁక * రెండవ మాఱు దేశమునఁ బ్రవేశించినవారు తమకంటె పూర్వము వచ్చినవారిని కదలింపక యమునాచంబలు నదీతీరములందు మాళవ గుజరాతు ప్రాంతములలో నానాముల నేర్పఱచుకొనిరి. ఈ విధముగా లెక్కకుమించిన తెగలు అనఁగా రాజ్యములు ఈదేశమున నేర్పడెను. ఇట్టి రాజ్యముల పేళ్ళు వీరకావ్యములందు పలుమారు వచ్చియున్నవి. మెగస్తనీసు ఇట్టిరాజ్యములను ౧౧౮ టిని పేర్కొనియున్నాఁడు. ఈ సంఖ్యకు మనమచ్చెరువొందవలసిన పనిలేదు. ఎందుచేతననఁగా ఒక సింధు పంజాబుదేశములలోనే లెక్కకు మిక్కిలియగు వేర్వేరు తెగలవారి రాజ్యములను అలెగ్జాండరు గెలువవలసినవాఁడయ్యెనని మనము చదివియున్నాముకదా! అది యట్లుండె. పురాతన హింద్వార్యులుకూడ గ్రీకులవలెనే విస్తీర్ణములగు రాజ్యములను స్థాపించుట ఎఱుఁగరని తోఁచుచున్నది. మన వారి రాజ్యమనఁగా, కొన్నివేళల, గ్రీకువారి రాజ్యమువలెనే

* వైద్యాగారు ఈదేశముమీద ఆర్యులు దండయాత్రలు రెండు మారులు జరిగినవని తలచుచున్నారు. ఇట్టి యూహకు కారణములు మాత్రము చూపి యుండ లేదు. ఒక క్రొత్తదేశమునకు నివసింపబోవువారు రెండు మారులు మాత్రమే పోయియుండిరని సాధించుట ఎట్లోమాకు దురూహ్యముగ నున్నది.



ఒక పట్టణమును ఆపట్టణవాసులు వ్యవసాయము చేసికొనుటకు అవసరమగునంత వైశాల్యముగల చుట్టు ప్రదేశమేయైయుండెను: ఐదూళ్ళు మాకిచ్చినఁ జాలునని ధర్మరాజు దుర్యోధనునకు సంధి సందేశమంపియుండెను. అనఁగా ఐదుగురు సోదరులకును ఐదురాజ్యములు వచ్చినఁజాలుననియు, అంతమాత్రము లభించెనేని క్షత్రియుఁడగు వాని మనస్సునందుండు అధికారాసక్తి నెరవేరుననియు ధర్మజుఁడు తలచియుండెను. అప్పుడేకాదు. నేఁడును క్షత్రియుఁడగువాడు ఒక గ్రామమునైనను సరే తాను సర్వస్వతంత్రుఁడుగా నేలఁ గోరుచున్నాఁడు. క్షాత్రియుగారంభమున ప్రతిపట్టణమునకు నొకరాజుండినట్లు ఈక్రింది శ్లోకము వలనఁ దెలిసియున్నది. * "తమకు తాము ప్రియము చేసికొను రాజులు ప్రతిగృహమునను కలరు. కాని వారిలో నొకఁడును సామ్రాట్టు కాలేదు. అట్టి బిరుదును సంపాదించుట కష్టము" అని భారతవర్షమునకుఁ జక్రవర్తి కాఁగోరుచుండిన ధర్మజుఁడు పలుకుచున్నాఁడు. ప్రతిపట్టణమునకును రాజొకఁడుండెననువచనమునుబట్టి చూచినచో, అట్టిరాజులకు పైవాఁడగు సామ్రాట్టు ఈ చిన్నరాజ్యములను రూపుమాపక వారియొద్దనుండి కప్పములను గాని బహుమానములనుగాని గొనుటలో తృప్తినొందుచుండెనని కూడ తోఁచుచున్నది. జయింపఁబడిన రాజును పదభ్రష్టుని జేయఁగూడదనియు, అతని మరల స్వస్థానమున నిలుపవలయుననియు. అతఁడు మృతుఁడైనచో అతని కుమారునకుగాని

* గృహే గృహే విరాజానః, స్వస్యస్వస్య ప్రియంకరాః ! నచ సామ్రాజ్యమాప్తాస్తే, సామ్రాట్ శబ్దో వికృచ్ఛ్రభాక్ ॥సభా॥

బంధువునకుఁగాని రాజ్యమియ్యవలయుననియు విధింపబడియున్నది. దుర్యోధన యుధిష్ఠిరుల దిగ్విజయమువలన వారిరాజ్యము విస్తరిల్లినట్లెక్కడను కానరాదు. చుట్టుపట్టులనున్న రాజ్యములుమాత్రము వారి సార్వభౌమత్వము నొప్పుకొనవలసినవయ్యెను. అల్పరాష్ట్రముల స్వాతంత్ర్యమును గౌరవించునట్టి యిట్టి యాచారమువలననే బ్రాహ్మణములలోను, ఉపనిషత్తులలోను పేర్కొనఁబడిన రాజ్యముల నేకములు క్షాత్రియుగమున మాత్రమే కాక, దాదాపు తద్యుగాంతము నాఁటివఱకును మనకు కానవచ్చుచున్నవి. కాశీ, కోసల, విదేహ, చేది, శూరసేన, కురు, పాంచాల, మత్స్య, వృష్ణి, భోజ, మాలవ, క్షుద్రక, మద్ర, కేకయ, గాంధార, సింధు, సౌవీర, కాంభోజ, కుశీనర, కిరాత, ఆనర్త మున్నగు అనేక రాజ్యములపేళ్ళు బ్రాహ్మణముల కాలమునుండి బౌద్ధయుగమువఱకు వచ్చుచున్నవి. రాజ్యపు పేరు సాధారణముగా నచ్చట వసించు తెగవారి పేరునకు బహువచన రూపముగానుండెను. కాశీ రాజ్యనామము మాత్రము పట్టణపు పేరునుబట్టి వచ్చినది. తక్కినవారిలో ననేకముల పేళ్ళు రాజుల నామములనుండి వచ్చినవి. ఉదాహరణము కురురాజ్యము; శూరసేనరాజ్యము.

అసంఖ్యాకములగు నీ చిన్నరాజ్యముల నొక్కొకరాజు పాలించుచుండువాఁడు. గ్రీసుదేశమందు, చరిత్రారంభకాలమున పట్టణమున కొకరాజుండెనని మనకుఁదెలియును. గ్రీసులోవలెనే మనదేశమందును జనులు (ముఖ్యముగా బ్రాహ్మణులు) రాజుల యధికారమునకుఁబూర్తిగా లొంగినవారుకారు.



ముఖ్యములగు నన్నిసమయములందును, జనులందఱు రప్పింపఁబడి యాలోచింపఁబడుచుండిరి. రామాయణమునందు మనకట్టి యుదాహరణము దొరకుచున్నది. దశరథుఁడు శ్రీరాముని యువరాజుఁ జేయఁదలఁచినపుడు బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులను రావించి వారి నీ విషయమున నభిప్రాయమడుగును. ¶

రామాయణమందీసందర్భమున నిచ్చినవర్ణనము నిజమైనదిగాఁ బొడకట్టుచున్నదికాని ఊహాజనితముగాఁ దోఁచుటలేదు. ఈ విషయమున నేమైని సందేహముండినను, మఱియొక సందర్భమునందలి వర్ణన దానిని దొలఁగించుచున్నది. శ్రీరాముఁడరణ్యమున కేగినపిదప దశరథుని మరణానంతరము భవితవ్యమును నిర్ణయించుటకు మఱియొకసభ సమావేశమయ్యెను. ఈసభయందు ద్విజులుండిరి. వీరు మంత్రులతో సమాలోచనము సల్పిరి. * రాముఁడును భరతుఁడును (ఇరువురును) లేరు; కనుక వేరొకరాజు నెన్నుకొనవలయునని సైతము సభ్యులు సూచించిరి. ఈయంశములను మనసునందుంచుకొని విచారించితిమేని రాజుఅధికారము నిరంకుశమైనది కాక, ప్రజాభిప్రాయమునకు-ముఖ్యముగా ఆర్యప్రజాభిప్రాయమునకు-లోఁబడినదై యుండెను. అప్పటికింకను రాజసత్తాక పద్ధతి (Monarchy) ఆరంభదశయందుండెను: అవ

---

¶ నానానగరవాస్తవ్యాన్, పృథగ్జానపదానపి । సమానినాయ మేదిన్యాం, ప్రధానాన్ పృథివీపతిః । బ్రాహ్మణాబలముఖ్యాంశ్చ, పౌరజానపదైః సహ॥ అయోధ్యాకాండ॥

* సమేత్యరాజకర్తారః, సభామీయుర్ద్విజాతయః॥ అయోధ్యాకాండ॥

సరమున్న పక్షమున జనులు తామే రాజును ఏర్పరచుకొనఁ గలిగి యుండిరి.

సాధారణముగా రాజసత్తాకపద్ధతియే వాడుకయందుండినను, అన్నిచోట్లను ఈపద్ధతియే సాగుచుండెనని మనమూహింపఁగూడదు. గ్రీసులోవలెనే మనదేశమందును నాయకసత్తాక రాజ్యములు (Oligarchies) ను, ప్రజాసత్తాక రాజ్యములు (Republics) ను ఉండెను. రాజసత్తాకములలో రాజుచేయవలసిన కార్యములనన్నిఁటిని పైనజెప్పినరాజ్యములలో కులవృద్ధుల సభ (లేక, శిష్టసభ Council of Elders) చేయుచుండెను. వీర కావ్యములలో నిట్టి పరిపాలనమునకు స్పష్టములగు నుదాహరణములు కానరావు; కాని మనదేశమున ప్రజాసత్తాకరాజ్యముల నేకము లుండెనని గ్రీకుచరిత్రకారులు వ్రాసియున్నారు. కపిలవస్తునగరమందు శాక్యులలో నీవిషయమున నెట్టి యాచారము లుండినదియు బౌద్ధగ్రంథములలో కానవచ్చుచున్నది. పలు తెగలలోని వృద్ధులసమావేశముచే నేర్పడిన సభవలన జరుగుచుండిన పరిపాలనము-అనగా నాయకసత్తాకపరిపాలనము మన దేశమందుండెననికూడ స్పష్టముగా దెలియుచున్నది. మహాభారతమునందు "గణములు" 'గణపతులు, అనుశబ్దములు పలుమారు వచ్చియున్నవి. వీనికి క్రమముగా, నాయకసత్తాకప్రజాసత్తాకపరిపాలనగల తెగలు, వానివలన నెన్నుకొనఁబడిన రాజులు అనియేయర్థమని మాకు దోచుచున్నది. మహాభారతములో ననేకమారులువచ్చిన "గణానుత్సవసంకేతాన్" అనుశబ్దముల యర్థమేమో మాకు నిశ్చయముగాఁ దోఁచుట లేదు. అర్జునుఁడు ఉత్తరదిగ్విజయయాత్రయందు వీరిని జయించెను. ¶ ఈ యేడుకుటుంబములు బహుశః ద్రోణపర్వమున వచ్చిన సంశప్తకులేయైయుందురు. పర్వతప్రాంతవాసులగుటవలనను, స్వతంత్రాభిలాష కలవారగుటవలనను, వీరు ఇప్పటికాలపు ఆఫ్రిదీలువు (Afridis) పశ్చిమోత్తరపు సరిహద్దుననుండు ఇతరతెగలవారునునై యుండవచ్చును. ఏలయనఁగా, ఈతెగలవారు అతిపురాతనకాలమునుండి శూరులుగను స్వాతంత్ర్యాభిలాషులుగను ప్రసిద్ధిఁజెందియుండుటే కాక ప్రజాసత్తాకపరిపాలనము కలిగియుండిరి. మహాభారతవ్యాఖ్యాతకు నాయకసత్తాకమన నేమియో ప్రజాసత్తాకమన నేమియో తెలియక కాఁబోలు పైశబ్దముల యర్థమునువివరింప లేదు. "గణము"నకు నాయకుఁడు కాఁ గోరువాఁడేమి చేయవలయునో పలుతావుల నాగ్రంథమున వచ్చినది. కనుక "గణపతి" యను నదొక గొప్పపదవియనియు, దానిబొందుటకుజనులు యత్నించుచుండిరనియు స్పష్టముగా గానవచ్చుచున్నది. ఈ కారణములవలన "గణము" "గణపతి" యనువాని యర్థమును పైనమేము సూచించినదే యైయుండవలయునని మాయాశయము.



రాజ్యాంగ విషయమున గ్రీకులకును మనకును ఇంతవరకు సామ్యమే యుండినది. ఇచ్చటనుండియే గ్రీకార్యహింద్వార్య నాగరికతయును అయోమార్గము రెండు బిన్నశాఖలుగాఁజీలి రెండు భిన్నదశలకుఁ బోయినది మనదేశమున రాజులయధికారము క్రమక్రమముగా వృద్ధియై వారిని నిరంకుశులుగను, ఈశ్వ

¶ పౌరపంయుధనిర్జిత్య, దస్యూన్ పర్వతవాసినః। గణానుత్సవసంకేతాన్ జయత్సప్త పాండవః॥

రాంశసంభూతులుగను జేసి ప్రజలహక్కులను నానాఁటికి నశింపఁ జేసెను, ఇఁక పశ్చిమమున గ్రీకులు రాజ్యాంగవిషయమున దమ భావముల వృద్ధిపరచుకొనిరి. అది యెట్టివృద్ధియనుకొనెదరు. నిరుపమానమైనది. ఆనాఁటిమాటయేకాదు; నేఁటికిని అథెన్సు ప్రజాసత్తాకరాజ్యమే ప్రపంచమందలి సకలప్రజాసత్తాకరాజ్యములకును ఆదర్శమై యొప్పుచున్నది. ఇట్టి ప్రచండభేదము మనకును వారికిని కలుగుటకుఁగల కారణములను వెదకుట చాలకష్టము. ఆప్రయత్నము ఈవ్యాసముయొక్క యుద్దేశమునుకాదు. ప్రాయశః కారణములు ఈక్రిందివైయుండవచ్చును:— ౧ జాతిభేదము లేర్పడుటవలన జనసామాన్యము రాజ్యాంగమున దమవిధుల మరచిపోయినందున క్షత్రియులుమాత్రమే ఈవిషయమునజోక్యము పుచ్చుకొనఁ దగినవారైరి. ౨. ఆర్యులు బహుళసంఖ్యాకులగు శూద్రులను సంఘమున ప్రవేశపెట్టుకొనిరి; కాని వారిని కాయకష్టమునకు పాలుచేసినందున జనసంఘములోని గొప్పభాగమును రాజ్యాంగవిధులకు అనర్హముగఁ జేసిరి. ౩. మైదానములలో జనావాసము విశేషమగుటవలన, రాజ్యములు చిన్నవిగా నుండినప్పుడు జనాభిప్రాయమును దెలిసికొనుటయందుగల సౌకర్యములు తరువాత లేకపోయెను. ఇప్పటికాలమున విశాలములగు దేశములందు జనాభిప్రాయమును గనుగొనుటకు ఏర్పడిన పద్ధతులు ఆకాలమున జను లెఱుఁగరు.

ఇఁక పశ్చిమమున గ్రీసుదేశపర్వత ప్రాంతములలో వసించిన తెగలవారు అందఱు ఒకవిధమైనవారుగను, దాదాపుగా అందరు ఆర్యులుగను, ఆదిమనివాసులసంబంధము మిగులతక్కువ



గా గలవారుగను నుండుటచేత వారు స్వతంత్రస్వభావులై నాయకసత్తాకరాజ్యముల నేర్పరచుకొనఁగలిగి. మన దేశమందలి తూర్పుభాగములోని మగధవంటివిశాలదేశములలో అనార్యజాతులు ఆర్యానార్యసంయోగమువలనఁ గలిగినమిశ్రమజాతులును విరివిగా నుండుటచేత అట్టిదేశములు ఎక్కువనిరంకుశపరిపాలనము కలవయ్యెను. 'దత్తు'కృతమగు "పురాతనహిందూదేశసభ్యత" యను గ్రంథమునం దుల్లేఖింపబడినది ఐతరేయబ్రాహ్మణములోని ఈక్రింది వచనమువలన పైయంశమే స్థిరపడుచున్నది. ఈయర్థమునఁగాక మఱేయర్థమునను ఈవచనమును సమన్వయించుటకు వలనుపడదు. "తూర్పుదిశయందలి రాజులు సామ్రాట్టులను బిరుదముల నందిరి. దక్షిణదిశవారు భోజులనిపిలువబడుదురు. పశ్చిమదేశీయులకు రాజులే లేరు. మధ్యమదేశముల రాజులు రాజులనియే పిలువఁబడుచున్నారు" అనఁగా తూర్పుదేశపురాజులు క్రమక్రమముగా నిరంకుశులగుచుండిరనియు, పశ్చిమదేశప్రజలు ఇంకను స్వతంత్రులుగానుండి స్వపరిపాలనము కలిగియుండిరనియు తేలుచున్నది.

విదేహదేశపురాజగు జనకుని పేరుతో ఉపనిషత్తులయందు వాడఁబడియున్న సామ్రాట్టుబిరుదము కాలక్రమమున 'రాజాధిరాజు' అను నర్థమున నుపయోగింపఁబడసాగినది. తూర్పుదేశమునందలి రాజులు బలవంతులగుటతోఁ దృప్తిజెందక "సామ్రాట్టు" బిరుదమునుగూడ కాంక్షింపసాగిరి. ఇంద్రప్రస్థమునకు రాజైన యుధిష్ఠిరుఁ డిట్టి బిరుదమును బొందఁగోరిన సందర్భమున, మహాభారతమునందు, ఈబిరుదుమెట్లుత్పత్తియైనదియు కృష్ణుఁడు వివరించియున్నాఁడు, క్షాత్రయుగారంభముననో, బౌద్ధయుగారం

భమునకుఁ గొంచెము పూర్వమేయుండిన మనవారి రాజ్యాంగస్థితినివర్ణించినదగుటచేత ఆవివరము నీక్రింద వ్రాయుచున్నాము. "పరశురాముని బారినుండి తప్పించుకొనిన క్షత్రియులు ఏకమై ఈనియమము నేర్పరచుకొనిరి. ఈవిధిని సూర్యచంద్రవంశముల వారిరువురును ఒప్పుకొనిరి. ఇళకును ఇక్ష్వాకునకును జనించినవారందరు నూర్గురని మీరెఱుఁగుదురు. యయాతివంశజులగు భోజులు నలుదిశలయందును లెక్కకు మిక్కిలిగా నున్నారు. ప్రస్తుతము రాజులందఱును తమలో నెల్ల మిగుల బలవంతుఁడగు జరాసంధుని సామ్రాట్టుగా నెన్నుకొని యున్నారు. కనుకనే అతఁడు మధ్యదేశమునను భవించుచున్నాడు. శూరుఁడగు శిశుపాలుఁడు అతని సర్వసేనాని యైనాఁడు. కరూశ రాజగు వక్రదంతుఁడు అతనికి సహాయకుఁడై యున్నాఁడు. పశ్చిమమునను న్న యవనుల రాజగు భగదత్తుఁడు అసంఖ్యసేనలు కలవాఁడు, మురనరకులను తనకులోఁబరచుకొని తటస్థుఁడుగా నున్నాడు. పశ్చిమదక్షిణ దిశలయందున్న కుంతిభోజపురుజిత్తు ఒకడుమాత్రము నీకు మిత్రుఁడు. వంగదేశవాసకులు. పౌండ్రక కిరాతులకును, రాజగు వాసుదేవునితోఁగూడి భీష్మకుఁడు జరాసంధపక్షపాతియైయున్నాఁడు. ఉత్తరదేశపురాజులలో ననేకులు—పాంచాల, శూరసేన, మత్స్యదేశాధీశులును తదితరులును—జరాసంధునకు భయపడి దక్షిణమునకుఁ బారిపోయినారు. ఎంతబలముగలవారైనను, ఎంతసమర్థులమైనను మేముకూడ మధురవదలి దుర్భేద్యమైనదియు, స్త్రీలవలన నైనను రక్షింపఁబడవీలైనదియునగు కుశాస్థలీదుర్గమునకు వచ్చియున్నాము. మధ్యదేశముననుండు భాగ్యము లేక ఇచ్చటికి వచ్చినందున కెంతయు వగచుచున్నాము." * పై వచనమున నుల్లేఖింపఁబడిన మధ్యదేశము హింద్వార్యులకు చాల ప్రియమైనదిగా నుండెను. ఇచ్చట నిలువకుండ కృష్ణుని జరాసంధుఁడు తరిమివేసెను. తక్కిన రాజులందఱును అతనికిలోఁబడి తదాజ్ఞానుసారము వర్తించుచుండిరి. సామ్రాట్టు నెన్నుకొను పై పద్ధతి కొంతవిచిత్రముగాగానవచ్చుచున్నది. బ్రాహ్మణులబారినుండితప్పించుకొనుట కింతటి ప్రబలప్రయత్నము కావలసియుండుటఁ జూడ ఆకాలమున బ్రాహ్మణులు గొప్పస్థితియందుండిరని తోఁచుచున్నది. మనవారి సార్వభౌమత్వముకూడ జర్మనీ సార్వభౌమత్వమువలెనే అందరివలన నెన్నుకొనఁబడునదిగను, చిన్నరాజ్యముల స్వాతంత్ర్యము నడగద్రొక్కనిదిగను ఉండెను. ఇట్టిపద్ధతి ఎప్పుడు ఏకారణమువలన మార్పుఁజెందెనో చూపుటకు వలయు సాక్ష్యము వీరకావ్యములందు లభింపదు. కాని చిన్నరాజ్యములను నాశనముచేసి మగధరాజ్యము విస్తరిల్లినరీతియు, కోసలులు కాశీరాజ్యమును మ్రింగివేసి తరువాత తాముకూడ మాగధుల నోటఁబడినవిధమును, బౌద్ధగ్రంథములందు మనకుఁ గానవచ్చుచున్నది. ఇదిబుద్ధుని మరణానంతరము జరిగినట్టిదియును, పారసీక సామ్రాజ్యస్థాపనమునకు సమకాలీనమునునగు వార్త. పెద్దపెద్ద రాజ్యములను స్థాపించుపద్ధతి నుపక్రమించినవాఁడు సైరసు (Cyrus) అనియు, పెద్దరాజ్యములను ఆధేయరాష్ట్రములుగాఁ జేసికొనివానిని సాత్రపుల (Satraps) ను ప్రతినిధులపాలనము



* సభాపర్వమున ౧౪ అధ్యాయము.

క్రింద నునిచి వారిని ఇచ్చవచ్చినట్లు మార్చుచు రాజ్యముచేయు పద్ధతి నారంభించినవాఁడు డెరయసు (Darius) అనియు తోఁచుచున్నది. అస్సీరియనులు (Assyrians) గాని ఇజిప్షనులు (Egyptians) గాని ఇట్టి యత్నము చేయలేదనియు, ప్రపంచమందలి మొట్టమొదటి నిజమైన నిరంకుశచక్రవర్తి (Autocratic Emperor) డెరయసేయై యుండవచ్చుననియు మాతలంపు. కనుక సింధునదికి పశ్చిమముననున్న దేశమును వశపరచుకొని, దానిని తనపారసీక సామ్రాజ్యమునఁ గలుపుకొని యొకసాత్రపుని క్రింద నుంచియుంచిన డెరయసుయొక్క పద్ధతిని మనవారు—అందును ముఖ్యముగా విశాలరాష్ట్రముల కధినాథులగు తూర్పుప్రాంతములవారు—ఆదర్శముగాఁ గొనియుంచిన నందాశ్చర్యమేమియు లేదు. బహుశః ఇట్లే చిన్నచిన్న రాజ్యములను పొట్టబెట్టుకొని నిరంకుశుడగు చక్రవర్తిపాలనము క్రింద మనదేశమున మొట్టమొదట మగధ గొప్పరాజ్యమయ్యెను. ఈక్షాత్త్రసామ్రాజ్యపురాజధాని 'రాజగృహ' నుండి పాటలీపుత్త్రమునకు మార్పఁబడెను. ఈపాటలీపుత్త్రమునందే మొట్టమొదటి హిందూదేశ చక్రవర్తియగు సాండ్రకోటసు అని గ్రీకులచే బిలువఁబడిన చంద్రగుప్తుఁడు రాజ్యముచేసెను. ఈతని యాస్థానముననే మెగస్తనీసు (Magasthanes) అను చరిత్రకారుఁడు రాయబారిగా నుండెను. వీరకావ్యములందు పాటలీపుత్త్రముమాట ఎచ్చటను లేదు. మగధరాజ్యమునకు రాజగృహపట్టణమే రాజధానియని రెండు కావ్యములందును పలుమారువచ్చినది. తరువాతకాలమున నుద్భవించిన సామ్రాజ్యములమాటకూడ వీరకావ్యములలో లేదు.



అప్పటివర కింకను ప్రబలరాజ్యములు దుర్బల రాజ్యములనుండి కప్పములఁ గొనుటతోనే తృప్తినొందియుండెను. రాజ్యములను విశాలముచేసికొను నాచారము వాడుకలోకి వచ్చియుండ లేదు.

అయినను, అప్పటికి రాజసత్తాకపద్ధతిమాత్రము సంపూర్ణముగాను నిరంకుశముగాను వ్యాపించియుండెను. వెనుక మేము చెప్పిన ప్రకారము ప్రజాసత్తాకపద్ధతియు ప్రజతో నాలోచించి పరిపాలనచేయు పద్ధతియు, అచ్చటచ్చట నుల్లేఖింపబడియున్నను, మొత్తముమీఁద వీరకావ్యములం దెచ్చటఁ జూచినను రాజు నధికారము ఎదురులేనిదిగాను, ప్రజల విధేయులఁజేసికొను నధికారము రాజునకు దైవదత్తముగాను ప్రశంసింపఁబడియున్నది. "రాజునకిట్టి యధికారమెట్లువచ్చె" నను ప్రశ్న హిందూవిజ్ఞానులమనసులను పలుమారు కలవరపెట్టెనువారట్టి ప్రశ్నకు తమయిచ్చవచ్చినట్లు సమాధానము చెప్పుకొనిరి. అయినను రాజునకుఁ గొన్నికర్తవ్యములు కలవనుమాటనుమాత్రము వారు మరచిపోలేదు. శాంతిపర్వములోని రాజధర్మవివరణమున, ఆరంభముననే యుధిష్ఠిరుఁడు భీష్మునడుగును. "రాజశబ్దమెట్లువచ్చినది? తక్కిన యందరివలెనే రెండు చేతులును రెండు కన్నులును కలిగి వారితో తుల్యమగు జ్ఞానమును మాత్రమేకల మనుష్యునికి తక్కినవారిని పాలించు నధికారమెట్లువచ్చెను?" దీనికి భీష్ముని ప్రత్యుత్తరమిది. "కృతయుగమున రాజే లేడు. ఆకాలమున జనులందరు స్వతంత్రులయి ధర్మమును తామే నడపుచుండిరి. తరువాత మనుజులు కామక్రోధాదులకు వశులై అధర్మమార్గానువర్తులై పాపకార్యములఁ జేయసాగిరి. పాపము మిక్కుటమగుటవలన దేవతలకు

బాధలు కలిగినందున వారు బ్రహ్మయొద్దకుఁబోయి ఈయాప
దను తొలఁగింపుమని వేడుకొనిరి. అంత బ్రహ్మదండనీతిని పెద్ద
గ్రంథముగా రచించి, దానిని శంకరునకు నేర్పెను. శంకరుఁ డిం
ద్రునకిచ్చెను. అతఁడు దానిని బృహస్పతి కిచ్చెను. బృహస్పతి
దాని సంక్షిప్తపరచి 3000 అధ్యాయములుకలదిగాఁజేసెను. దీనికి
బృహస్పతినీతియని పేరు. శుక్రుఁడు దానినింకను సంగ్రహపరచి
1000 అధ్యాయములలో నిమిడ్చెను. ప్రజాపతి యాశాస్త్ర
మును అనంగున కిచ్చెను. ఈ యనంగుడు తద్గ్రంథానుసారము
ప్రపంచమును పాలించిన మొదటిరాజు. అతనిసుతుఁడు అతిబా
లుఁడగువాఁడు తండ్రిమార్గము ననుసరించెను; కాని వానికుమా
రుఁడగు వేనుఁడు ధర్మాతిక్రమణముతో భూపరిపాలన మొనర్చి
స్వేచ్ఛావర్తనుడయ్యెను. కనుక ఋషులాతనివధించి అతని కుడి
తొడనుండి పృథువనువానిని సృజించిరి. పిమ్మట బ్రాహ్మణు
లును దేవతలును అతనితో నిట్లనిరి. "ఈభూమిని ధర్మశాస్త్రా
నుసారము నిష్పాక్షికముగా సమదృష్టితోఁ బాలింపుము. బ్రా
హ్మణుల శిక్షింపననియు వర్ణసాంకర్యమును ఆపెదననియు వాగ్ద
త్తము చేయుము" పృథువట్లేవాగ్దత్తముచేసి తదనుసారము న్యా
యముగా నేల యేలెను. బ్రాహ్మణులును దేవతలును స్వవచనా
నుసారము అతనికి శ్రేష్ఠవస్తువుల నిచ్చిరి. అతఁడు భూమిమీఁది
రాలను తీసివేయించి యదిపదునేను విధములగు గడ్డిని, మనుష్యు
లకును యక్షులకును ఇతరులకును కావలసియున్న వృక్షవర్గము
ను ఇచ్చునట్లుచేసెను. ప్రజారంజకుడగుటచేత అతఁడు "రాజు"



అని పిలువబడెను. * "తనయాజ్ఞ నెవరును మీరఁగూడదని
విష్ణువు శాసించి తాను స్వయముగానే రాజుశరీరమును జొచ్చె
ను. † కావుననే ప్రపంచమంతయు దేవునకువలె రాజునకును
మ్రొక్కెదరు. రాజగువాఁడు విష్ణువంశముతోను దండనీతి
యొక్క జ్ఞానముతోను పుట్టును." పురాతన హిందూదేశపు
జిజ్ఞాసువులు రాజుయొక్క నిరంకుశాధికారము నీవిధముగా సమ
ర్థించిరి. రాజువిష్ణ్వంశ సంభూతుఁడయినను, ఈశ్వరదత్తమగు
దండనీతి ననుసరించి న్యాయముగా ప్రజను పాలించుట ఆతనివిధి
యనియు వారు నమ్ముచుండిరి. ఆకాలమున బ్రాహ్మణులు
సాధారణశిక్షలనుండి తప్పించుకొనయత్నించిరి. కనుకనే స్మృ
త్యాదులందు బ్రాహ్మణుల దండించు విషయమున ప్రత్యేక
నియమములు కలవు. ఈప్రకారము రాజులు, ప్రజనురంజింపఁ
జేయవలయునను తమకర్తవ్యమును ఈశ్వరదత్తముగా భావింప
బడిన దండనీతి నియమములను నిర్లక్ష్యముచేసి క్రమక్రమముగా
నిరంకుశులైరి.

రాజుయొక్క నిరంకుశాధికారము సత్పరిపాలనానిర్బంధము
తోఁగూడియుండెనని వెనుకఁ జెప్పియుంటిమి. ఈయభిప్రాయమే
మహాభారతమునందు వేరొక యధ్యాయమున మరియొకవిధ
ముగాఁ సూచింపఁబడియున్నది. రాజునకును ప్రజకును జరిగిన
ఒడంబడికను బట్టి వారికిట్టి సంబంధమేర్పడినదని ఈయధ్యాయ

* రంజితాశ్చప్రజాః సర్వాస్తేన రాజేతి శబ్ద్యతే॥ శాంతి॥

† స్థాపనంచాకరోద్విష్ణుః, స్వయమేవసనాతనః । నాతివర్తిష్యతే కశ్చి, ద్రాజంస్త్వామితిభారత!తపసాభగవాన్విష్ణు, రావివేశచభూమిపం॥ శాంతి॥

మునసాధింపబడినది. ఇట్టి యభిప్రాయమే పాశ్చాత్య విద్వాంసులలోఁగొందరు - హాబ్సు (Hobbs) మున్నగు వారు - సూచించియున్నారు. "పూర్వకాలమున రాజనువాఁడు లేకపోవుట వలన ప్రజకనేక కష్టములు సంభవించెను. అందువలన జనులందఱేకీభవించి ఇతరుని దూషించినవాఁడును, కొట్టినవాఁడును, పరుని భార్యను చెఱచువాఁడును, శిక్షింపఁబడవలయునని నియమము చేసికొనిరి. కాని యానియమమును అమలులోఁబెట్టుటకు వలయుశక్తి లేనందున, వారందఱు ప్రజాపతికడకుఁబోయి, తమకొక పాలకుని నియమించుమనియు, అట్టిపాలకుని తాము గౌరవింతుమనియు, అతఁడు తమ్ము కాపాడవలసియుండుననియు, వేడికొనిరి. బ్రహ్మ మనువును ప్రజాపాలనము చేయుమని కోరెను. కాని మనువు అందున కొప్పుకొనక, జనులు పాపాత్ములు కనుక వారిని పాలించుట పాపహేతువనియు, ప్రజాపరిపాలనము కష్టకార్యమనియు చెప్పెను. అంత జనులు మనువుతో నిట్లనిరి. 'మీరు భయపడవలసిన పనిలేదు. పాపాత్ములగువారే తమ పాపఫలము ననుభవింతురు. మీకు మాయొద్దనున్న పశువులలోను బంగారములోను అయిదవభాగమును మాధాన్యములో పదియవభాగమును ఇచ్చెదము. వివాహఋతువులో ఒక సుందరిని మీకిచ్చెదము. మాలో ముఖ్యులగువారు సాయుధులై మీకడవర్తింతురు. మమ్ము సుఖముగాను నియమబద్ధముగాను పాలింపుఁడు. మాకు లభించు పుణ్యమున నాల్గవభాగమును మీకిచ్చెదము. అంత మనువు వారివిన్నపము నంగీకరించి కార్యారంభ మొనర్చెను. అతఁడు శత్రువుల నందఱ నిర్మూల



పరచి జనులను ధర్మమార్గమున నడిపించెను. కనుక జనులు సదా తమకొఱకొక రాజు నేర్పరచుకొనవలయును." ధర్మమును నడపెదనని మనువును, దానికి ప్రతిగా పన్నులఁ జెల్లింతుమని ప్రజలును ఒడంబడిక చేసికొనిరను నభిప్రాయము చాలశ్రేష్ఠమైనదే కాని నిరంకుశప్రభువులు, మన దేశమందేమి ఇతర దేశములందేమి తమ వాగ్దత్తమును చెల్లించుకొనియుండుట అరుదుగాగాన వచ్చుచున్నది.

ఎంతటి నిరంకుశుఁడైనను, ఎంతటి భోగపరాయణుఁడైనను, రాజు, మొత్తముమీద శాంతిని స్థాపించుటయందును, న్యాయముచేయుటయందును సామాన్యముగా శ్రద్ధాళువై యుండెను. రాజపాలనమున నున్న జనులు అరాజకముగా నున్న దేశములోని ప్రజలకంటె సర్వదా ఎక్కువబలవంతులుగను ఎక్కువ సుఖులుగను ఉండుచు వచ్చిరి. అరాజకమువలన నష్టములు ఉభయ వీరకావ్యములందును విస్పష్టముగా వర్ణింపఁబడియున్నవి. బహుశః జనులకుఁగల అరాజకభయమే రాజుల యధికారమును బలవత్తరముగఁ జేసియుండ వచ్చును. అయోధ్యకాండములోని ౬౭ వ అధ్యాయమున, దశరథుఁడు మృతినొంది రాముఁడును భరతుఁడును దేశమున లేని సమయమున కర్తవ్యమును నిర్ణయించుటకు జనులు సభచేసిరి. ఆసందర్భమున నిట్లున్నది. "రాజులేని దేశమున మేఘములు వర్షింపవు. పిడికెడు ధాన్యమైనను విత్తరు. పుత్త్రులు జననీజనకులకును, భార్యలు భర్తలకును విధేయులుగా నుండరు. ఏమనుజుఁడును తనసొత్తునుగాని తనభార్య సహవాసమునుగాని యనుభవింపఁజాలఁడు. సత్యము

నకు గౌరవముండదు. వేదాధ్యయనపరులగు బ్రాహ్మణులు యాగాదులఁ జేయరు. ఇఁక పండుగల మాటయు, సాంఘిక సమావేశముల మాటయు చెప్పవలయునా? ఆభరణాలంకృతులగు జవ్వనులు సాయంత్రములందు పురముబయటి తోఁటలకుఁ బోఁజాలరు. జనులు తలుపులఁదెఱచి నిదురింపఁజాలరు. వేగముగల బండ్లలో అడవులకుఁ బోవనేరరు. వర్తకులు దేశసంచారము చేయలేరు. జనులు ధనుర్విద్యాభ్యాసము చేయనేరరు. ఊరూరఁ దిరుగుచు ఎచ్చటఁగోరిన నచ్చట విశ్రాంతిఁగొను జ్ఞానులు కానరారు. వసంతకాలపు నననవలాడు వృక్షములవలె ప్రకాశించుచుండు యౌవనులగు రాకొమరులు కన్పట్టరు. జలములేని నదివలెను, పచ్చికలేని యడవివలెను, పసులులేని కాపరివలెను (?) రాజులేని రాజ్యముండును. శరీరమునకు నేత్రములెట్లు ప్రధానములో, దేశమునకట్లె రాజు ధర్మపాలనార్థమవసరము. అహో! మంచిచెడుగులను వేరుపరచు రాజు లేనిచో, ఎచ్చటజూచినను అంధకారము నిండియుండును; ఏమియు కనుపడదు."¶ రామాయణములోని సమస్తవర్ణనలవలెనే అరాజకమునుగూర్చిన పై వర్ణనకూడ చాలమనోహరముగా నున్నది. దుర్మార్గులగువారి పోకడల నడఁచుటకు రాజులేని పక్షమున కలుగు అనర్థములను గూర్చి మనవారెంత భయపడుచుండిరో పైవర్ణనయే చెప్పుచున్నది. ఈభయము అతివిస్తారమైనందున జనులు రాజ్యాంగమున శ్రద్ధగొనక, పరదేశీయులైనను సరే దేశమున శాంతిని

¶ అహోతమఇవేదంస్యాన్న ప్రజ్ఞాయేతకించన! రాజాచేన్నభవేల్లోకే విభజ్జసాధ్వసాదుని। అయో॥



నెలకొల్పుదుమని ధైర్యమిచ్చు ఎవ్వారికైనను విధేయులైయుండ సిద్ధపడియుండిరి. రాజు లేకపోవుటవలనఁ గలుగు నష్టములు మహాభారతమునందలి శాంతిపర్వములోని ౬౭-౬౮ అధ్యాయములలోఁగూడ వర్ణింపఁబడినవి. ఈవర్ణన రామాయణములోని వర్ణనయంత రమ్యముగా లేకపోయినను, ఎక్కువప్రత్యక్షముగాఁ గానవచ్చుచున్నది. అచ్చట నిట్లున్నది. "రాజు అసలేలేనట్టిగాని దుర్బలుఁడుగానున్నట్టిగాని దేశమునుజయించుటకై సమర్థుఁడగు మనుజుఁ డెవఁడేని కోరుచుండెనేని జనులాతనికి స్వాగతమిచ్చుటయే మంచిది. ఏలయన, అరాజకదోషములకంటె భయంకరములు మరేవియులేవు. అతఁడు సంతసించెనేని అంతయు బాగుగా నడుచును; ఆగ్రహించెనేని అతఁడు సర్వనాశముచేయును. తిప్పలపెట్టక పాలిచ్చు ఆవు నెవరును బాధింపరు. కాని బాధపెట్టి పాలిచ్చు ఆవును బాధింతురు." × రాజ్యాంగమునందు రాజునకు ఆలోచనచెప్పు నధికారము తమకుఁ గలదను మాటను జనులెట్లు మరచిరో మనకిచట స్పష్టముగాఁ గానవచ్చుచున్నది. జనులు తమ్ముఁ దాము బలవంతుఁడగు వానికి పాలివ్వవలసిన యావులుగా భావించిరి. ఈ విధముగా క్షాత్రయుగాంతము

× అథచేదభివర్తేత, రాజ్యార్థీ బలవత్తరః।అరాజకాణిరాష్ట్రాణి హతవీర్యాణివాప్రనః॥ ప్రత్యుద్గమాభిపూజ్యస్యాః, దేవదేవసుమంత్రితం। నహి పాపాత్పరతర మస్తికిఞ్చిదరాజకం। సచేత్సమనుపశ్యేత సమగ్రంకుశలంభవేత్॥ బలవాన్హిప్రకుపితః కుర్యాన్నిశ్శేషతామపి॥ భూయాంసంలభదేక్లేశం యాగౌర్భవతి దుర్దుహా। అథియాస్తునుహా రాజ న్నైవతాం వితుదంత్యపి॥ శాంతి।

నాఁటికి హింద్వార్యుల రాజ్యాంగదశ విషాదకరముగా నేలఁ గూలెనని దెలియుచున్నది.

రాజగువానిని ఎవరును అంటనైనఁ గూడదనియు, అతని వచనములు దేవవాక్యములనియుకూడ తలఁచు నవస్థకు ఆకాలమువారు పొల్పడిరి. రాజు విషయమున దురుద్దేశములుకలవాడు ఈలోకముననేగాక పరలోకమునకూడశిక్షననుభవించునని వారి తలంపు. * సుప్రసిద్ధమగు నీ శ్లోకము శాంతిపర్వమున నున్నది. × "మనుష్యుఁడేకదాయని రాజును చులకనుగాఁ జూడఁగూడదు. రాజనగా నరరూపముననున్న గొప్పదేవత." అధర్ములను శిక్షించునపుడును, సధర్ములను రక్షించునవుడును, "రాజు" యముఁడుగాను, "ఒకనియొద్దనుండి రథమును లాగికొని మరియొకని కిచ్చునపుడు "కుబేరుఁడు" గాను ఎంచబడుచుండెను. రాజు చేయుపనులు సక్రమములా యక్రమములాయని ప్రశ్నించు అధికారము ఎవనికిని లేదు. రాజద్రివ్యాపహారి ఈలోకమున శిక్ష నొందుటయేకాక అతిలోతైన నరకకూపమునఁగూడ కూలునని నమ్మఁబడుచుండెను. వేయేల? రాజుయొక్క దైవాంశ జనుల మనములందుదృఢముగా నాటుకొనినందున, రారాతనికిఁ జూపు విధేయత దాస్యముకు సమానమగు స్థితికివచ్చెను.

రాజునకుఁగల యధికారములలో నెల్ల గొప్పది జనులను

* యస్తస్య పురుషః పాపం, మనసాప్యనుచింతయేత్ । అసంశయమిహక్లిష్టః, ప్రేత్యాపినరకంవ్రజేత్ ॥

× నహిజాత్వవమంతవ్యో, మనుష్యఇతిభూమిపః । మహతీదేవతాహ్యేషా, నరరూపేణతిష్ఠతి॥



శిక్షింపఁ గల్గుట మహాభారతమున దీనిని "దండ" మని వాడఁబడియున్నది. కాలక్రమమున మూర్ధాభిప్రాయము లెన్నియో ఈ "దండ"ముయొక్క యథార్థమగు నర్థముచుట్టును మూగెను. శాంతిపర్వములోని ౧౨౧-౧౨౨ అధ్యాయములలో నీ "దండ" ముయొక్కయు, తదాకారముయొక్కయు, దాని యుత్పత్తియొక్కయు వర్ణనలు కలవు. ఈ "దండము" ప్రజాపతివలన సృష్టింపఁబడెననియు, సర్వజనులయెడ నిష్పాక్షికముగా వాడబడిదగినదనియు మేమిదివరకే వ్రాసియున్నాము. బ్రిహ్మ దీనిని క్షత్రియులకే యిచ్చెను. రాజు దీనిని యథేచ్ఛముగా ప్రయోగింపఁ గూడదు. బ్రహ్మ విధించిన నియమముల ననుసరించి, దీనిని వాడవలయును. "మానవజీవితము స్వల్పకాల పరిమితమగుట వలన ప్రపంచ లాభము కొరకు బృహస్పతియు శుక్రుఁడును దీనిని క్రమముగా ౩౦౦౦ అధ్యాయములలోను ౧౦౦౦౦యధ్యాయములలోను రచించిరి. మహాభారతముయొక్క తుది * నిర్మాణకాలమున నీ రెండు గ్రంథములు ఉండియుండవచ్చును. ఇప్పటికిని ఇట్టిపేర్లుగల గ్రంథము లున్నవి కాని యవి సౌతి ¶ కాలమున నుండినవి కాకపోవచ్చును. శాంతిపర్వములోని రాజధర్మఘట్టము

* మహాభారతము మూడుమారులు నిర్మితమయ్యెననియు, ప్రస్తుతాకారము తుదియనియు, వైద్యా. గారిభావము మా. హ.

¶ మహాభారతముతుదిమారునిర్మించినవాడు 'సౌతి' 'వైద్యా'గారియాశయము (వైద్యాగారి "మహాభారతము" అను గ్రంథమును జూడుఁడు) మా. హ.

పై గ్రంథముల సారాంశమై యుండవచ్చును. దండ నీతి ఈశ్వర దత్తమని యొప్పుకొనఁబడుటవలన, రాజుల నిరంకుశ వర్తనమునకు కొంత యాటంకము కలిగి యుండవచ్చును. మత సంబంధమగు భయమువలన, రాజులు ప్రజాపతి విధించిన నియమములననుసరింప చాలవఱకు బద్ధులుగా నుండియుండవచ్చును.

---

# క్షాత్రయుగమునాటి హిందూ ఆర్యులు- వారి భూగోళశాస్త్రజ్ఞానము

క్షాత్రియుగారంభమున హిందూ ఆర్యులకు భూగోళశాస్త్రి జ్ఞాన మెంతయుండునో యూహించుటకష్టము కాని తద్యుగాంతము నాఁటికి వారికి హిందూదేశమునుగుఱించియు చుట్టుప్రక్కల నున్న దేశములనుగురించియు బాగుగాఁ దెలిసియుండెనని చెప్పవచ్చును. ప్రపంచభూగోళమును గుఱించి వారికి వివరములంతగా దెలిసియుండలేదు. ఆప్రకారము తెలియనిచోట్లయందెల్ల వారు ఊహతో పనిగొనిరని తేలియున్నది. వీరికావ్యములందు వచ్చియున్న వర్ణనలనుబట్టి వారి "ప్రపంచము" ఎట్టిదిగానుండెనో చూతము.

మహాభారతానుసారము:-ప్రపంచము అనేక ద్వీపములుగా భాగింపఁబడియున్నది. మనముండు భూభాగమునకు "జంబూద్వీపము" అనగా జంబూవృక్షముకల ద్వీపము అని పేరు. ఈద్వీపము అనేక 'వర్షము'లుగా విభజింపఁబడి యున్నది. *(పటము జూడుఁడు) భూమికి ఉత్తరపు సరిహద్దున క్షీరసముద్రమున్నది. దక్షిణపు హద్దున లవణసముద్రము కలదు. పూర్వ పశ్చిమ

* ఈవర్షములలో కొన్ని నిజమైనవిగను కొన్ని యూహాజనితములుగను దోఁచుచున్నవి.

లందును సముద్రము లున్నవి. * భూమధ్యప్రదేశమున మేరు పర్వత మున్నది. దీనికి దక్షిణమున మూఁడు పర్వతపంక్తులు పూర్వ పశ్చిమదిశలవ్యాపించియున్నవి. వీనిపేళ్ళు నిషధపర్వతము (ఆల్టాయ్); హేమకూటము (కారాకోరము) హిమాలయము; హిమాలయమునకు దక్షిణమున భారతవర్షమును అదేయక్షాంశమునను్న ఇతర దేశములును కలవు. వీని కుత్తరమున హైమవత వర్షమున్నది. నిషధపర్వతమున కుత్తరమున ఇలావృతవర్షము కలదు. మేరువు, చిన్నవగు మఱిరెండు పర్వతములు (మాల్యవంతము గంధమాధవము, అనునవి) ఈభూభాగమును నాల్గు చిన్నభాగములుగాఁ జేయుచున్నవి. ఈనాల్గుభాగములలోనొకటి జంబూద్వీపము. ఈద్వీపమునకీపేరు అతివిశాలమగు నొక జంబూ వృక్షమునుండి యుత్పత్తియై ఉత్తరకురు దేశమువైపు ప్రవహించిన జంబూనదిఁబట్టి వచ్చినది. తక్కినమూఁడింటిలో పశ్చిమ దిశనున్న రెండు దేశములకు (భద్రాశ్వము, (కేతుమాల, యని పేళ్లు. పైనవచ్చిన హైమవతవర్షమునందు ఇప్పటి జపాను, మంచూరియా, మంగోలియా, ఉత్తరతుర్కిస్థానము, జర్మనీ, ఇంగ్లాడు చేరియుండవలెనని యనేకుల యభిప్రాయము ఇక మేరువు అనునది ఉత్తరధృవసమీపమున నుండెనని యూహించినచో ఇలావృతవర్షమున ఇప్పటి రష్యా, స్వీడెను, నార్వేలు ఒక వైపునను ఉత్తరఅమెరికా ఇంకొకవైపునను చేరియుండెనని చెప్ప వచ్చును ఇచ్చటిభూమి బంగారపుదని మనవారు చెప్పియున్నారు ఉత్తర కనడాలోని యొకభాగమున బంగారుదొరకుచున్నమాట

* ఈసముద్రముల పేళ్లు మాత్రము కానరావు.



వాస్తవమే కాని? ఈసామ్యము కాకతాళీయముగా సంభవించిన దని తోఁచుచున్నది. ఈవర్షమునందే చేరియున్న రష్యాసైబేరియాలు ఇప్పటికాలమందంత సుఖప్రదమైనవి కాకపోయినను పురాతనకాలమున నిప్పటికంటె నెక్కువ వాసయోగ్యములుగా నుండి యుండవచ్చును. ఇంతేకాక అవి యార్యుల అతిపురాతన నివాసస్థలము లైనకారణమున వారు ఆప్రదేశమును "పుణ్యభూమి"గా నెంచుచుండిన నుండవచ్చును. మేరువున కుత్తరమున నున్న వని చెప్పబడియున్న మూఁడు పర్వతము లు దక్షిణముననున్న మూఁడు పర్వతపంక్తులనుబట్టి కల్పింపబడినవై యుండవచ్చును. దక్షిణముననున్న పర్వతపంక్తులను మాత్రము మనవారెఱిఁగియే యుండిరనుట నిస్సంశయము. ఏలయనఁగా కైలాసపర్వతమున కుత్తరముననున్న హరివర్షమునం దొక విశాలమైన ఇసుక యెడారియు నొకసరోవరము ఉండినట్లు వర్ణింపఁబడియున్నది. మహాప్రస్థానికపర్వమునందుఁ గూడ పాండవులు నుత్తరాభిముఖులై పోవునప్పుడు ఒక యిసుక యెడారిని దాటిరని చెప్పబడియున్నది ఈయిసుకయెడారి యిప్పటి "గోబి" యెడారియేయనియుసరోవరము "ఆరల్‌సముద్రము" (Sea of Aral) అనియుస్పష్టముగాఁ దెలియుచునే యున్నది కడా.

కొంతయదార్థమును కొంతయూహాజనితమును నగు పైవర్ణనయే ఇంచుకమార్పుతో రామాయణమునందు వచ్చినది; కాని రామాయణమునందు ఊహకు నిరంకుశ ప్రభుత్వములభించినందున మఱింతగందరగోళము సంభవించినది రామాయణమును తుదిమారువ్రాసిన యాతనికిహిందూదేశపు

భూగోళవివరములు సరిగా తెలియవు. తెలిసినభాగమంతయు నొక ఉత్తర హిందూస్థానము మాత్రమే. అట్లుండియు, అతఁడు సుగ్రీవుఁడు సీతాన్వేషణమునకై వానరులను నలుదెసలకంపుచుండిన కథగల సంధర్భములో, ప్రపంచభూగోళమును కేవలమూహాపోహలతో నింపి వర్ణించియున్నాఁడు ఈవర్ణనమునందు మేరువు ఉత్తరమునుండి యెగిరి ప్రపంచముయొక్క దక్షిణదిశాంతయన వచ్చి నిలచినది రామాయణపు తుదికర్త జ్యోతిశ్శాస్త్రజ్ఞానము లేని వాఁడగుట చేతకాబోలు, మేరువు పశ్చిమముననుండనిచో సూర్యుఁడు మేరువుచుట్టు తిరుగుటెట్లు సంభవించునని సందేహపడి యామేరువును పశ్చిమదిశాంతమున స్థాపించెను!

సూర్యుఁడు తూర్పుకొండలయందుదయించి పడమటి కొండలలో నస్తమించుననియు ఈకొండలు రెండును ప్రపంచమునకు పూర్వపశ్చిమదిశలందు హద్దులనియు, వానికావలి ప్రదేశములు మనుష్యులు ప్రవేశించుటకు వీలులేనివనియు అస్తమసమయమున సూర్యుఁడు మేరువువెనకకుబోయి, పడమటికొండనుండి యుత్తరమునకుఁబోయి యుదయసమయమువఱకు తూర్పుకొండ వద్దకివచ్చుచుండుననియు మనవారి యూహ. మనమునొకరినే యననేల? భూమిపలకవలెనన్నదని నమ్ముచుండిన పూర్వకాలపువారందఱికిని పశ్చిమమునకుఁబోయి యదృశ్యుఁడైన సూర్యుఁడు ఉదయమువఱకు తూర్పున కెట్లువచ్చుచున్నాఁడో యనునది మహదాశ్చర్యకరమగు సమస్యయైయుండెను!

అప్పటికాలపు హింద్వార్యుల ప్రపంచభూగోళజ్ఞానము సరియైనదిగా నుండకపోయినను, వారికి మనదేశమునుగుఱించి



యు, మనచుట్టుప్రక్కలనున్న దేశములగురించియు బాగుగాఁదెలిసియుండుననియు యొప్పుకొనకతప్పదు. హిమాలయము, కారాకోరము, అల్టాయ్ అనుమూఁడు పర్వతపంక్తులును- తిబెత్, తుర్కిస్థానము, సైబీరియాల యందుండిన „గోబీ„మున్నగు నెడారులును, అనేకసరస్సులును వారికిఁదెలిసియుండెను. గ్రీకులను, పర్షియనులను, సిథియనులను, హూణులను, చైనీయులను, ఉత్తరప్రాంతములందు నివసించు అనాగరకజాతులను వారెఱింగియుండిరి. అలెగ్జాండరుని దండయాత్రయైన పిమ్మట మనవారికి పైనఁబేర్కొనిన జాతులవారి పరిచయముకలిగెనని కొందఱువాదింతురుకాని యదిసరికాదు. మహాభారతములోని యొకశ్లోకము * నందు ఉత్తరదిశయందలి మ్లేచ్ఛులు పేర్కొనఁబడియున్నారు. వారిలో హిందూదేశమునకుత్తరమున నివసించుచుండినజాతులన్నియు చేరియున్నవి. క్షాత్రయుగాంతమున అనఁగా అలెగ్జాండరునిదండయాత్రకు పిమ్మట ఈజాతులవారిని మనవారెఱుఁగుదురనుటయందు సంశయము లేదు. కాని అంతకుపూర్వము కొన్నిశతాబ్దముల కాలమునుండియే మనవారు ఈజాతులకు కృతపరిచయులేదనుటకు కారణములుకలవు. "డెరయసు" అనుపారశీకదేశపురాజు సింధునదికి పశ్చిమముననున్న భూభాగమును తనసామ్రాజ్యమున గలిపికొని దానినొకసాత్రపీ (Satrapy) గానేర్పఱచెను. కనుకపారసీక

---

* యవనాశ్చనకాంభోజా, దారుణా మ్లేచ్ఛజాతయః । సకృద్గృహాః కులత్థాశ్చ, హూణాః పారసికైః సహ । తథైవరమణాశ్చీనాః, తథైవదశమాలికాః ॥ —భీష్మపర్వము. అధ్యా: ౯

రాజధానియందును, పారసీక సేనలయందును జయింపఁబడినమన
వారిలోననేకులుండియుందురు. కనుక మనవారు గ్రీకులను,
సిథియనులను అలెగ్జాండరుని రాకకెన్నియో శతాబ్దములకు పూ
ర్వము ఎఱిగినవారైయుండవలెను. 'హిరోడోటసు, అనుచరిత్ర
కారుఁడు 'డెరయసు, పాలనముక్రిందనున్న సాత్రపీలను వర్ణిం
చుచు ఇరువదవ సాత్రపీయగుమనదేశము (హిందుస్థానదేశము)
విశేషజనసంఖ్యకలదనియు, దీనికి తూర్పుసరిహద్దున నొకయెడా
రియున్నదనియు చెప్పియున్నాఁడు. హిరోడోటసు పై చరిత్ర
గ్రంథమును క్రీ. పూ. ౪౫౦ సంవత్సరప్రాంతమున వ్రాసినాఁ
డు కనుక ఆకాలమునమనవారిని గ్రీకులెఱిఁగియుండిరనుట స్పష్ట
ము. అంతేకాదు. ఆస్సీరియనుల (Assyrians) తోడను చాల్డి
యనుల (Chaldeans) తోడను హిందువార్యులకు అంతకుపూ
ర్వమే వర్తకసంబంధములుండెను. కనుక మాయభిప్రాయము
న; మనవారు 'యవను,లనబడు అయోనియనులను గుఱించి క్రీ.
పూ. ౪౫౦ సంవత్సరముకంటె పూర్వమే చెప్పుకొనఁగా విని
యుండవచ్చును. పరిచయము మాత్రము "డెరయసు,, కాల
మునుండి కలిగియుండవచ్చును. మహాభారమునందలియొక *
శ్లోకమునందున్నట్లు, అలెగ్జాండరుదండయాత్ర యైనతరువాత
వారితో మనవారికి మఱింత సమీపసంబంధ మేర్పడియుండవలె
ను. యవనులనుగూర్చిచెప్పిన యీమాటయే పారసీకులు, సిథి
యనులు మున్నగు ఉత్తరదేశవాసులకుఁ గూడవర్తించుచున్నది.

ఇక హిందుస్థానదేశమునకువత్తము. క్షాత్రయుగారంభమునుండి

* సర్వజ్ఞా యవనా రాజన్, శూరాశ్చైవవిశేషితః ॥ కర్ణపర్వము.



తద్యుగాంతమునాఁటివఱకును కొంతస్పష్టముగనైన నేమి కొంత
యస్పష్టముగనైననేమి, మనవారుఈదేశము నామూలాగ్రముగ నెఱిఁ
గియుండిరి. వేదమునందు సముద్రముమాటవచ్చియున్నది సింధు
నదీప్రవాహము వెనువెంట నౌకలలోఁబోయి యుండిననేకాని
వారికి సముద్రపు సంగతి తెలిసియుండదు. వేదమునందు పంజా
బునందలి నదుల పేళ్ళును, గంగాయమునల పేళ్ళును, (వీనియు
త్పత్తిస్థానములకు సమీపమున వారినదుల నెఱిఁగియుండిరి.) వచ్చి
యున్నవి. రామునికాలమున మనవారు తూర్పుసముద్రమును,
గోదావరినదిని, కొంతయస్పష్టముగానైనను లంకాద్వీపమును,
తెలిసియుండిరి. శ్రీకృష్ణునికాలమున ఉత్తరహిందుస్థానమునా
మూలాగ్రముగను,దక్షిణహిందుస్థానములోని చాలభాగమును
మనమునఱిఁగియుండిరి. ఇంతయేల? మహాభారతము తుదిమారు
నిర్మింపబడుటకుముందే, అలెగ్జాండరుని దాడికిముందే, మనవా
రికి హిందుస్థానదేశము బాగుగాఁ దెలిసియుండుననుటకు సందియప
డవలసిన పనిలేదు.

అయినను పాశ్చాత్యవిద్వాంసులు ఈవిషయమున
తప్పుగా నభిప్రాయపడి యున్నారు. వారి వ్రాతలనుబట్టి
చూచినచో, బుద్ధునికాలమున మనవారికి దక్షిణదేశము తెలి
యనేతెలియదు. చంద్రగుప్తకాలప్రాంతమున మనవారు లంకా
ద్వీపమున నివసింపబోయిరట! బుద్ధుని నిర్యాణ సంవత్సరమున
లంకాద్వీపమున మొట్టమొదట ఆర్యజనావాసమేర్పడెనను నభి
ప్రాయముతప్పనియు, నికాయములు వ్రాయఁబడుటకుముందు
ఆర్యులు సింహళమునకువచ్చుట సంభవించి యుండదనియు,నైను

దేవిడ్సు వ్రాసియున్నాఁడు. ఇట్టివాదమున కాధారమేమనఁగా, బుద్ధునికాలమున రచింపఁబడిన పైగ్రంథములలో చెప్పబడియున్న ౧౬ రాజ్యములలో ఒకరాజ్యముమాత్రము వింధ్యకు దక్షిణమున గోదావరితీరమునందుండినట్లు చెప్పబడియుండుటయట. "ఆగ్రంథములలో దక్షిణహిందూస్థానము, లంకాద్వీపము, పేర్కొనఁబడియుండకపోవుటే కాక గంగానదికి తూర్పుననున్న వంగ, ఒరిస్సా దేశములుకూడ లేవు; దక్షిణాపథమురాలేదు. "దక్షిణాపథమునకు వారువచ్చుట నికాయములకాలమున సంభవించినది." "వినయ" గ్రంథమునందు "భరుకచ్ఛ" పేరును, "ఉదాన" గ్రంథమునందు "సుప్పరక" పేరును వచ్చినవి" "రామాయణీయప్రాముఖ్యతగల దక్షిణహిందూదేశమును గుఱించియు లంకాద్వీపమును గుఱించియు ఉల్లేఖనమే లేకపోవుటయు, ఆర్యులపురోగమనము అంతపరిమితముగా నుండునదియు ఆలోచింపదగిన యంశములై యున్నవి" ౨ అని రైసుడేవిడ్సువ్రాసెను.

పైవాదము మామనస్సునకు అసంగతమైనదిగా దోఁచుచున్నది. బుద్ధునికాలపు ఒకగ్రంథమున పేర్కొనఁబడిన ౧౬ రాజ్యములలో చెప్పఁబడనిరాజ్యము ఆకాలమున అసలేయుండలేదను వాదమెట్టిదనఁగా, భారతమున రెండుమారులు వచ్చియున్న షోడశమహారాజుల పేళ్ళలో లేని మహారాజెవ్వఁడు పురాతన హిందూదేశమున నుండలేదనువాదమువంటిది. పూర్వకాలపు గ్రంథములందువచ్చిన యిట్టిపేళ్ళపట్టికలు సమగ్రమైనవియని యూహించుటకు కారణము కానరాదు. అగ్రం-

Buddhist India by Rhys Davids.



థములు సంపూర్ణములగు చరిత్రలుగాని భూగోళశాస్త్రములుగాని కావు. పైవాదము ఇట్టివైపరీత్యమునకులోనైనదని తెలియుచుండినను ఏలనో పలువురు విద్వాంసులిట్టి తర్కమే చేయుచుందురు. ఒక సంగతికాని యొకపేరు కాని పురాతన మతగ్రంథమున పేర్కొనఁబడియుండ నంతమాత్రమున అట్టి సంగతికాని ఆపేరు కాని ఆకాలపుజనులకు తెలిసియుండదని వాదించుట తర్కమేకాదని కొంచెమాలోచించిన ప్రతివానికి తెలియఁగలదు. *

దక్షిణహిందూస్థానమును, సింహళమును, మన వారికి అలెగ్జాండరుదండయాత్రకంటె పూర్వమే అనఁగా చంద్రగుప్తునకు లేక నికాయములు వినయగ్రంథములు వ్రాయబడిన కాలమునకు పూర్వమే తెలిసియుండెనని చూపుటకు కావలసినంత సాక్ష్యముకలదు. అలెగ్జాండరు వెంటనుండిన ఎరటస్తనీసు (Eratasthanes) మున్నగు పాశ్చాత్త్యగ్రంథకర్తల వ్రాతలను బట్టిచూడఁగా హిందూదేశపు టుత్తరభాగమున నివసించుచుండిన వారికి హిందూదేశమునుగురించిన సంపూర్ణజ్ఞానముండెనని తెలియుచున్నది. హిందూదేశమునుగురించిన వివరములను మన

* సింధు, సౌవీర, సౌరాష్ట్రదేశముల పేళ్ళు ఈ ౧౬ రాజ్యములలో లేవు. అయినను ఈరాజ్యములు మూఁడును ఆకాలమునను, అంతకు పూర్వమునను ఉండినవే యనుట నిస్సంశయము. పైన చెప్పిన ౧౬ రాజ్యములు బౌద్ధమత ప్రచారకులు పోయి తన్మతవ్యాప్తికి యత్నించిన రాజ్యములై యుండవచ్చును. ఇతర రాజ్యములుండెను కాని బౌద్ధమత ప్రచారకు లచ్చటికి పోలేదని యూహింపవలెను.

వారు ఆలెగాండరునకు చెప్పియుండిరని ఎరటస్తనీసు వ్రాసిన గ్రంథమునఁగలదు. ఈ గ్రంథమున మన దేశమందలి **ముఖ్య**ప్రాంతముల వైశాల్యములు చూపఁబడియున్నవి. దేశాకారమునుగురించి యావివరములు నేటికిని సరిపోవుచున్నవనియు అంతపురాతన కాలమున మనవారికి దేశమునుగురించి యంతటివివరములు తెలిసియుండుట గొప్ప విషయమనియు, కన్నింగ్‌హాము (General Cunningham) ఆశ్చర్యమును ప్రకటించియున్నాఁడు.[2]

---

[2] The close agreement of the dimensions given by Alexander's informants with the actual size of the country is very remarkable and shows that the Indians at, that early date of their history had a very accurate knowledge of the form and extent of their native land.

(Cunningham's Ancient Geography of India.)

# ప్రకటనలు.

## కృషిప్రచారిణీ గ్రంథమాల,

## సూర్యాపేట, (నైజాం.)

సంపాదకుడు పువ్వాడ వెంకటప్పయ్య.

నిజాము రాష్ట్రభావ్యభివృద్ధి ప్రబోధకములగు గ్రంథరాజములు వెలువడకయున్నందున యుడతాభక్తిని ఆంధ్రభారతీ చరణపూజ నొనర్చి కృతార్థుడగాదలంచి పై పేరుతో నొక గ్రంథమాల మామిత్రుల ప్రోత్సాహముచే స్థాపించితిమి. సహృదయులగు మాసోదరుల సానుభూతియు, సహాకారమును నా సాహసఫలితమును, విజయోన్ముఖము గావించగలవని విశ్వసించెదము. మాగ్రంథమండలినుండి సంవత్సరమునకు 800 పుటలుగల నాలుగు గ్రంథములు వ్యవసాయ, పరిశ్రామిక, నైతిక, చారిత్రక సంబంధములగునవి నవల, నాటక, శాస్త్ర, ప్రబంధ రూపముల సుప్రసిద్ధ కవివరేణ్యులచే వ్రాయించి ప్రచురించగలము.

## చందావివరము.

ఉద్ధారకులు అనుగ్రహాధీనము.

| | | |
|---|---|---|
| ప్రధానపోషకులు | సం॥ నకు | రు ౫౦ లు. |
| రాజపోషకులు | ,, | రు ౩౫ లు. |
| పోషకులు | ,, | రు ౧౫ లు. |
| సహాయకులు | ,, | రు ౧౦ లు. |
| చందాదారులకు | ,, | రు ౪ లు. |

ఉద్ధారకులు, ప్రధానపోషకులు, రాజపోషకులు, పోషకులు నామములు మాత్రము సంపూర్తి చిరునామాతోడను, సహాయకుల నామములుమాత్రమును మేము ప్రకటించు ప్రతి గ్రంథమున నుండును.

సంవత్సరము చందా ప్రప్రథమముననే రాబట్టుకొందుము. అట్టివారి తపాలావ్రయములు మేమే భరింతుము. అటులగాక ప్రవేశరుసుము 0-8-0 లు మాత్రము ముందు చెల్లించి చందాదారులుగ జేరువారు ఏకుసుమమున కా కుసుమము, కుసుమవ్యయముతోపాటు తపాలా వ్రయములు భరించవలసి యుండును. ఇతరులకు నూరుపుటలకు మూడుపావులాలవంతున అమ్మబడును. గ్రంథములు అత్యుత్తమరీతిని ముద్రించబడు.

ఇతర వివరములనుగూర్చి కార్యస్థానమునకు వ్రాయుడు.

ఇట్లు విధేయుడు,

మూపూ రామనర్సయ్యగుప్త, మేనేజరు,

కృషిప్రచారిణీ గ్రంథమాల,

సూర్యాపేట (నైజాం) నకరకల్లు బ్రిటిషుపోష్టు.

# గోలకొండ పత్రిక.

త్రూపుబజారు, హైదరాబాదు (దక్కన్.)

వారమునకు రెండుపర్యాయములు ప్రతి బుధవారము, శనివారము ప్రకటింపబడును. ఇందు సారస్వత, పరిశ్రామిక, వాణిజ్య, వ్యవసాయక వ్యాసములును, సర్కారు జరీదాలు, ఫర్మానులు, ఆంధ్ర దేశవార్తలు, ప్రపంచవార్తలు మొదలగునవి



ప్రకటింపబడును. ఆంధ్రదేశమున ప్రథమముగా వెలువడిన అర్ధవారపత్రిక యిద్యదియే. ప్రతిఆంధ్రుడును పఠింపదగినది.

సంవత్సర చందా రు ౭-౦-౦ అర్ధ సం॥ ర చందా రు ౩-౧౨-౦.

గోలకొండపత్రికా కార్యాలయము, త్రూపుబజారు,

దక్షిణ హైద్రాబాదు.



# సుజాత.

చక్కని సచిత్రమాసపత్రిక.

త్రూపుబజారు, దక్షిణ హైద్రాబాదునుండి ప్రతిఆంగ్లేయ మాసారంభమున ప్రచురింపబడును. త్రివర్ణచిత్రములు, చారిత్రక సచిత్రవ్యాసములు, వాఙ్మయవిషయిక విమర్శనలు, మహాకవుల జీవితములు, మనోరంజకమగు కథలు, నాటకములు, హృదయానందములగు పద్యములు, శాస్త్రీయపరిశోధనా వృత్తాంతములు, ఆంధ్ర దేశమునకు సంబంధించిన అముద్రితశాసనములు, ఉత్కృష్ట ఆంధ్రేతర రచనల యనువాదములు, ముఖ్యముగా మహారాష్ట్ర, హింది, ఉర్దూ, ఫారశీక కవిత్వ విశేషణములు మున్నగునవి పేరుబడసిన పండితులచే వ్రాయింపబడి ఉత్తమరీతిని ముద్రింపబడి ప్రకటింపబడును. సంవత్సరపుచందా యతిస్వల్పము. జనసామాన్యమున కందుబాటులో నుండవలెనని రు 3-0-0 మాత్రమే యుంచబడినది. త్వరపడుము. వెంటనే చందాదారుగ జేరుడు.



# తెనుగుపత్రిక, ఇనుగుర్తి.

**(Via. Manukota N. G. S. Ry.)**

**వారపత్రిక.**

సంపాదకులు డాక్టరు ఒ. శీతారామచంద్రరావుగారు.

చందా రు ౩-౧౨-౦ లు మాత్రమే.

ఇది నిజాము రాష్ట్రాంధ్రదేశమున ప్రప్రథమమున వెలువడి ౫ సం॥ములనుండి నిరాటంకముగా దేశసేవచేయుచున్నది. ఇందు పారిశ్రామిక వ్యవసాయక, వైద్య, విద్యావిషయిక వ్యాసములు, విశేషములు. వార్తలు మొదలగునవి ప్రచురింపబడును. ప్రతి ఆంధ్రుడును తప్పక నీపత్రిక చదువవలసినదే.

---

# విజ్ఞానప్రచారిణి గ్రంథమాల.

**నెమలికొండ, జగ్త్యాలతాలూకా (నైజాం)**

**మంచి** అనుభవజ్ఞులచే వ్రాయించబడిన **అత్యుత్తమ**మగు నాలుగు గ్రంథములు. వ్యవసాయ, వైద్య, పారిశ్రామిక, చారిత్రక విషయముల గురించి ప్రతిసంవత్సరము ప్రకటింపబడును. సం॥ చందా రు ౪ లు. మొదటిగ్రంథము స్వీకరించినప్పుడేధనము చెల్లింపవలసి యుండును. వివరములకై పై చిరునామాకు వ్రాయుడు.

---



# ఆంధ్రాభ్యుదయము.

నిజాము రాష్ట్రమున నీతి, మత, సాంఘిక, జ్యోతిష, వైద్యసంబంధములగు వ్యాసములు, పారిశ్రామిక, ఆర్థిక, సమస్యలు, వర్తకచరిత్రములు, ఆర్యులవిద్యలు, కళలు, శాస్త్రములు, మహాపురుషుల జీవితములు, చరిత్రాంశములు, భాషాంతరీకరణములు మున్నగునవి వివిధవిషయములు వ్రాయుచరిత్ర మాసపత్రిక. చందా సం॥ నకు రు ౬ లు.

గ్రంథాలయములకు రు ౫ లు.

వలయువారు:— కోకలశీతారామశర్మ, సంపాదకుడు.

ఆంధ్రాభ్యుదయము, అనుమకొండ, వరంగల్, నైజాం.

అనివ్రాయవలెను.

---

# నీలగిరి.

నిజాము రాష్ట్రమున వెలువడిన మొదటి తెనుగుపత్రిక. ఇందు విదేశ, దేశీయ, జాతీయ, సాంఘిక విషయములును, నిజాము రాష్ట్ర పరిశోధక విషయములును చక్కని రూపమున ప్రతి గురువారమును ప్రకటింపబడును. చందా సం॥కు రు ౪-౮-౦

వలయువారు:—

నీలగిరి కార్యాలయం, నల్లగొండ. యనివ్రాయవలెను.

---

శ్రీ వేంకటేశ్వర గ్రంథమాలగార్లవారు ప్రకటించిన ఆరు గ్రంథములు కలిపి క్యాలికో బైండు చేయించి మూడురూపాయిలకే యిచ్చుచున్నారు.

---

# కాకతీయ గ్రంథమాల, ఓరుగల్లు (నైజాం.)

సంపాదకులు: శ్రీ శేషాద్రి రమణకవులు.

కార్యదర్శి: తూము వరదరాజులు, వకీలు.

నిజాము రాష్ట్రమున సమగ్రమగు భాషాసేవగావించుటకై పై గ్రంథమాల స్థాపించి యుంటిమి. నవరసభరితములగు నవలలు, ప్రబంధములు, చారిత్రక గ్రంథములు ప్రచురింపబడును. ప్రవేశరుసుము రు 0-4-0

## ప్రచురింపబడిన గ్రంథములు.

౧ ఆంధ్రమంత్రులు చరిత్ర.

౨ విక్రమోర్వశీయము (ప్రబంధము.)

౩ వసుంధర (నవల రెండు భాగములు)

పై పుస్తకములు చందాదారులగువారికి ప్రవేశరుసుముతో రు 3 లు హాలీలకే యివ్వబడును.

వివరములకై పై విలాసమునకు వ్రాయుడు.

ప్రకటించువారు—

శేషాద్రిరమణకవులు,

నందిగామ, కృష్ణాజిల్లా యని వ్రాయుడు.

---



# నిజాము రాష్ట్రాంధ్ర జనకేంద్ర సంఘము

ఉద్దేశము:— నిజాము రాష్ట్రములోని యాంధ్రులయందు పరస్పరసహానుభూతి కలిగించి వారియభివృద్ధికై ప్రయత్నించుట.

కార్యవిధానము:— ౧ ఆంధ్రోద్యమప్రచారము చేయుట.

౨ చారిత్రక పరిశోధనము జరుపుట.

౩ విద్యాసంస్థలకు సహాయము చేయుట.

౪ విద్యార్థులను ప్రోత్సాహపరచుట.

౫ జనసామాన్యమున విజ్ఞానము వ్యాపింపజేయుట.

ఈపనులను నెరవేర్చుటకై సంఘపక్షమున నొక ప్రత్యేకనిధి "నిజాము రాష్ట్రాంధ్రనిధి" యను పేర స్థాపింపబడినది దానికి ప్రతియాంధ్రుడును యథాశక్తి ద్రవ్యసహాయమొసగి దేశకార్యమున పాలుగొనవలయును. శుభాశుభ కార్యములందు విరాళము లియ్యవలయును. ఎంతకొద్ది మొత్తమైనను వందనములతో తీసుకొని రశీదు ఇయ్యబడును.

ద్రవ్యము యీక్రిందివారిలో నెవరికయినను పంపవచ్చును.

| | |
|---|---|
| కొండా వెంకటరంగారెడ్డి | మాడపాటిహనుమంతరావు |
| హైకోర్టు వకీలు, | హైకోర్టు వకీలు, |
| నిధివ్యవహర్త, | కార్యదర్శి, |
| రెడ్డి బిల్డింగు, ఫీల్‌ఖానా, | త్రూపుబజారు, |
| హైదరాబాదు. | హైదరాబాదు. |

త్వరపడుడు ఓం ఆంధ్రభారతినుద్ధరింపుడు.

# సారస్వతచంద్రికాగ్రంథమాల, ఆర్లపాడు.

ఈగ్రంథమాల నవీనముగా మొన్నమొన్ననే స్థాపింప బడినది. ఇందుమూడుమాసముల కొకటివంతున చారిత్రక, విమర్శక; నైతిక, ఆర్థిక గ్రంథరాజములు; నాటకనవలా రూపముల సుప్రసిద్ధకవిపుంగవులచే రచింపఁబడినవి ప్రకటింపబడును. ప్రతి గ్రంథమును, అద్భుతకథా సంవిధానమును, మధురమధురంబగు శైలియు, భావగాంభీర్యమునుగలిగి ఆంధ్రలోకమునలరింపనున్నది.

సంపాదకుడు:—వూటుకూరు సత్యనారాయణరావు బహద్దరు జమీందారుగారు.

ప్రకాశకుడు:—మామునూరు నాగభూషణంగారు.

ప్రథమకుసుమము. "వెన్నెలకుప్పలు."

ఇయ్యది పలువురాధునిక కవిశేఖరుల పద్యకావ్యసంపుటము. షెల్లీస్కాట్ వర్డ్సువర్త్, బార్లీ మొదలగు సుప్రసిద్ధాంగ్లేయ కవిశేఖరుల మనోహరకవితారీతులనుగూడ నలంకరింపగల ఆంధ్రభారతీ కంఠమాలా మనోజ్ఞరత్నము. ప్రాశస్త్యమును భవైకవేద్యము. చక్కనిఫెదరువైటు కాగితములపై ముద్రింపఁబడి సిద్ధముగానున్నది. వెల రు 1-0-0.

గ్రంథమాల వివరము లరయగోరువారు ఈక్రింది చిరునామాకు వ్రాసిన తెలియగలరు.

సారస్వత చంద్రికా కార్యాలయము,
ఆర్లపాడు, గంపలగూడెం పోస్టు, కృష్ణాజిల్లా.

---

